Photo by : SURAJ N. SHARMA



DANCER FROM MYSORE

రామ్, శ్యామ్‌ల ధననిధి వేట

దొరికింది, దొరికింది-ఒక్క
పుస్తకంలో దొరికింది!
క్యాప్టెన్ కుక్ దాచిన
ధననిధి నక్షా

ఇద్దరు పరుగెత్తి-పడవలో
ఎక్కేరు సొమ్ము వెతుకుతూ
సముద్రాలు దాటేరు

రోజులు
దొర్లాయి-తుఫాను
లేచింది

గండాలు తప్పి
ఇద్దరు-ఒక ఒడ్డు
మీద పడ్డారు

రోజంతా
తిరిగి-గుడిసె
ఒకటి చేరేరు

ఒంటరి తాత నిద్రపోవ్వుల
చూచేరు తాతను లేపి
తను నక్షాను చూపేరు

తాత వారికిచ్చేడు ఇంకొక
ధననిధి-పాపిన్స్; పాపిన్స్-
తీయని బిళ్ళల నిధి

నోరూరించే, మనసుదోచే మై మరపించే

పార్లే

పాపిన్స్

పండ్ల రుచిగల
పిప్పరమెంట్లు

PARLE POPPINS

5 పండ్ల సువాసనలలో
13 మధురమైన బిళ్ళలు
ప్రతి ప్యాక్‌లో నిమ్మ, మోసంబి,
నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

everest/507/PP Tel

**Statement about ownership of CHANDAMAMA (*Telugu*)**

**Rule *8* (Form IV), Newspapers (Central) Rules, *1956***

1. *Place of Publication* ... 'CHANDAMAMA BUILDINGS'
   2 & 3, Arcot Road
   Vadapalani, Madras-600 026

2. *Periodicity of Publication* ... MONTHLY
   1st of each calendar month

3. *Printer's Name* ... B. V. REDDI
   *Nationality* ... INDIAN
   *Address* ... Prasad Process Pvt. Ltd.,
   2 & 3, Arcot Road
   Vadapalani
   Madras-600 026

4. *Publisher's Name* ... B. VISWANATHA REDDI
   *Nationality* ... INDIAN
   *Address* ... Chandamama Publications
   2 & 3, Arcot Road
   Vadapalani
   Madras-600 026

5. *Editor's Name* ... CHAKRAPANI (A.V. Subba Rao)
   *Nationality* ... INDIAN
   *Address* ... 'Chandamama Buildings'
   2 & 3, Arcot Road, Vadapalani
   Madras-600 026

6. *Name & Address of individuals who own the paper* } Chandamama Publications
   PARTNERS:

   1. Sri B. Nagi Reddi
   2. Smt. B. Padmavathi
   3. Smt. B. Bharathi
   4. Sri B. V. Sanjaya Reddi (Minor)
   5. Sri B. N. Suresh Reddi ,,
   6. Sri B. V. Satish Reddi ,,

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

1st *March* 1974

---

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్ట్

49F-203R-TEL



# చందమామ

నంస్థాపకుడు, నాగిరెడ్డి
నంచాలకుడు, 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ ''పరిస్థితుల ప్రభావం'' ] నారెడ్డి నాగిరెడ్డి రచన.

వాస్తవ సమస్యలకు అవాస్తవికమైన పరిష్కారం ఆలోచిస్తే ఫలితం ఎలా ఉండేదీ ''ఆకలిమందు'' అన్న కథ నిరూపిస్తుంది.

చాలామందికి తాము చేసే ఉపదేశాలలో తమకే విశ్వాసం ఉండదు. అందుచేత ఉపదేశం వల్ల చెప్పేవాడికన్న వినేవాడే లాభం పొందవచ్చు. ఈ విషయం ''లాభించిన ఉపదేశం'' లో కనబడుతుంది.

సంపుటి 54 మార్చి '74 సంచిక 3



# అమరవాణి

పిబంతి నద్య స్స్వయమేవ నాంభః,
ఖాదంతి న స్వాదుఫలాని వృక్షాః,
పయోధరా స్సస్య మదంతి నైవ,
పరోపకారాయ సతాం విభూతయః. 1

[నదులు తామే నీరు తాగవు. చెట్లు తమ ఫలాలను తాము తినవు. మేఘాలు (తాము పండించిన) పంటలను తినవు. మంచివాళ్ళు సంపదను పరోపకారానికే వినియోగిస్తారు.]

శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః:
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్. 2

[అనేక గ్రంథాలలో చెప్పిన విషయాన్ని సగం శ్లోకంలో చెబుతాను: పరోపకారం పుణ్యం కోసం, పరపీడన పాపం కోసం.)

ఆత్మార్థం జీవలోకేస్మిన్ కో న జీవతి మానవః?
పరం పరోపకారార్థం యో జీవతి స జీవతి. 3

[ఈ జీవప్రపంచంలో తన కోసం బతకని వాడెవడు? కాని పరోపకారం కోసం జీవించే వాడే నిజంగా జీవించే వాడు.]

పరోపకారం



# యక్షపర్వతం

## 22

[గురుభల్లూకుడి శిష్యులు చెప్పిన మోసపుమాటలు నమ్మి, వీరపురసేనాని సైనికులను వెంటబెట్టుకుని బిలదుర్గంలోకి దిగాడు. అది అవకాశంగా తీసుకుని ఖడ్గ జీవదత్తులు బిలద్వారానికి నిప్పు పెట్టించే ఏర్పాట్లు చేసి, లోపలవున్న వీరపురసైనికుల్ని, ఆయుధాలు అక్కడే వదిలి పైకి వచ్చి లొంగి పోవలసిందిగా ఆజ్ఞాపించారు. తరవాత—]

బిలదుర్గంలో శత్రువుల కోసం వెతుకుతున్న వీరపురసేనానికి, పైనుంచి జీవదత్తుడు చేసిన హెచ్చరిక వినిపించింది. అతడు మొదట ఆశ్చర్యపోయాడు, అంతలోనే దుర్గద్వారం దగ్గిర నుంచి బిలంలోకి వస్తున్న పొగను చూసి భయం పట్టుకున్నది. అతడూ, సైనికులూ బిలంలోని ఎన్ని గదులు వెతికినా ఒక్కగానొక్క మనిషైనా కనిపించలేదు. రెండు మూడు చచ్చిన తోడేళ్ళూ, చిందరవందరగా పడివున్న ఎలుగ్గొడ్డు చర్మాలూ, ఈ రెలూ మాత్రం అతడికి కనిపించినై.

సేనాని తన సైనికులను దగ్గిరకు పిలిచి, "అరణ్యంలో కనిపించిన ఎలుగ్గొడ్డు వెధవలిద్దర్నీ యిక్కడికి లాక్కురండి. వాళ్ళు మనను చాలా తెలిగ్గా మోసం చేసి, యీ తోడేళ్ళ బిలంలో దించారు," అన్నాడు.



సైనికులిద్దరు గురుభల్లూకుడి శిష్యులను రెక్కలు పట్టుకుని యీడ్చుకుని వచ్చి సేనాని ముందు నిలబెట్టారు. సేనాని కత్తి దూసి, ''ఒరే, దుర్మార్గుల్లారా! మీరు చేసిన మోసం తెలిసిపోయింది. మిమ్మల్నిప్పుడే ముక్కలు ముక్కలుగా నరకబోతున్నాను," అన్నాడు.

ఆ మాటలకు భల్లూకుడి శిష్యులు ఏమీ చలించకుండా, ''గురువాజ్ఞ నిర్వహించాం, యిక మాకు చావు భయం లేదు!'' అని తలలు పైకెత్తి బిలద్వారం కేసి చూసి, ''అదుగో, విన్నారా! క్షత్రియ యోధులైన ఖడ్గజీవదత్తులు లొంగిపోవలసిందిగా మిమ్మల్ని మరోసారి హెచ్చరిస్తున్నారు. వాళ్ళకు లొంగిపోయి శరణు కోరకపోయారో, మీరందరూ యీ బిలంలో మంటల్లోనూ, పొగలోనూ చిక్కి మాడి చావటమో లేక ఊపిరాడక పందికొక్కుల్లా గిలగిల తన్నుకుంటూ ప్రాణాలొదలటమో జరుగుతుంది.'' అన్నారు.

భల్లూకుడి శిష్యులు చెప్పిన ఆ క్షత్రియ యోధులిద్దరూ ఎవరో, వాళ్ళకూ సమర బాహుకూ వున్న సంబంధం ఏమిటో అడిగి తెలుసుకోవాలనిపించింది, సేనానాయకుడికి. కాని, అలా తీరిగ్గా ప్రశ్నలడిగి సంగతి సందర్భాలు తెలుసుకునేందుకు అవకాశం లేకుండా పైనుంచి కాలుతున్న కట్టెలూ, భగభగమంటూ మంటలు రేగుతున్న ఎండుటాకులూ వాళ్ళున్న ప్రాంతాన పడసాగినై. సైనికులందరూ ప్రాణభయంతో ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ వాటినుంచి దూరంగా పారిపోసాగారు.

వీరపుర సేనానికి తానెంత గడ్డు చిక్కులో పడిందీ అర్థమైపోయింది. అతడు ప్రాణాలు దక్కించుకునేందుకు లొంగిపోవటం తప్ప మరో మార్గం లేదని గ్రహించి, తన కత్తిని నేలమీద పడవేసి, సైనికులందరికీ ఆయుధాలు కింద పెట్టమని ఆజ్ఞ యిచ్చి, బిలద్వారం కేసి తల ఎత్తి, ''పైనున్న సుక్షత్రియ యోధు

ల్లారా! వీరపురసేనానినైన నేను, నా సైని కులతో పాటు లొంగిపోతున్నాను. ఆయుధాలు లేకుండా బిలం పైకి రాబోతున్నాను. అక్కడ వున్న మంటలను ఆర్పించండి!'' అని కేక వేశాడు.



సేనాని కేక బిలం పైనున్న ఖడ్గ జీవదత్తులకు వినిపించింది. వాళ్ళు ఎలుగ్గొడ్డుముఠా వాళ్ళకు మండుతున్న ఎండుపుల్లల్నీ వాటినీ దూరంగా లాగివేయమని చెప్పారు. వాళ్ళలా చేయగానే ఖడ్గ జీవదత్తులు బిలం దిగువకున్న మెట్ల దగ్గిరకు పోయి, లోపలికి తొంగి చూశారు. వాళ్లకు చీకటీ వెలుగూగావున్న బిలం అడుగున వీరపురసేనానీ, సైనికులూ కనిపించారు.

''ఖడ్గా, సేనాని అన్నమాటల్లో మోసం ఏమీవున్నట్టు లేదు. ఇక వాళ్ళందర్నీ పైకి రమ్మందామా?'' అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ జవాబు చెప్పేలోపలే గురుభల్లూకుడు అక్కడికి వచ్చి జీవదత్తుడితో, ''అయ్యా, రాజులూ, వాళ్ళ బుట్లూ నమ్మదగిన మనుషుల లెక్కలోకి రారు. ముందుగా నా శిష్యుల్ని పైకి రమ్మని, వాళ్ళద్వారా సంగతి తెలుసుకుందాం,'' అన్నాడు.

"కుటిలుడికి కుటిలుడే సరైన ఉజ్జీ!" అంటూ జీవదత్తుడు నవ్వి, ''సరే, భల్లూకా! నీ శిష్యుల్ని ముందుగా పైకి రమ్మని కేకవెయ్యి,'' అన్నాడు.

గురుభల్లూకుడు చేతిలోవున్న ఈటెను పైకెత్తి, ''వృకేశ్వరీ మాతకూ, జై!'' అని బిలద్వారం దద్దరిల్లేలా కేక పెట్టి, ''ఒరే, శిష్యుల్లారా! ముందుగా మీ యిద్దరూ పైకి రండి. అంతవరకూ ఆ రాజభృత్యుల్ని వున్నచోటనే అగమనండి,'' అని సమరబాహు కేసి కనుసైగచేసి, ''ఇది, కొండకోట రాజైన సమరబాహు మహారాజుగారి ఆజ్ఞ!'' అన్నాడు.

తమ గురువు ఆజ్ఞ వింటూనే భల్లూక శిష్యులిద్దరూ మెట్లెక్కి బిలం పైకి



వచ్చారు. దిగువనున్న వీరపుర సేనానికి, తాను ఒక రాజుకూ, ఇద్దరు యువ క్షత్రియ యోధులకూ, భయంకరులైన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళకూ బందీనై పోయానన్న భయంతో ముచ్చెమటలు పోశాయి. వీళ్ళల్లో ఎవరికి తనపై అసంతృప్తికలిగినా, తన ప్రాణాలు తీసేస్తారు...

భల్లూకుడి శిష్యులు బిలంలో జరిగినదంతా చెప్పి, వీరపుర సైనికులందరూ ఆయుధాలు కింద పారవేశారని తెలియపరిచారు. అప్పుడు ఖడ్గ జీవదత్తులు, వీరపుర సేనానినీ, సైనికులనూ ఇక బయిటికి రావలసిందిగా ఆజ్ఞాపించి, ముందు జాగ్రత్త కొరకు తమ అనుచరులందరినీ ఆయుధాలతో సర్వసన్నద్ధంగా వుండమన్నారు.

వీరపురసేనాని బిలం పైకి వస్తూనే ఖడ్గ జీవదత్తుల్ని చూసి వాళ్ళకు నమస్కరించబోయేంతలో జీవదత్తుడు అతడికి సమరబాహును చూపించి, "ఈయన ఈ ప్రాంతాలకు రాజు, చంద్రవంశస్థుడు, పేరు సమరబాహు. ఈయనే మిమ్ములను మందిబలం, యుక్తిబలంతో జయించారు. మీరు లొంగిపోవలసింది యీ మహారాజుకు!" అన్నాడు.

వీరపుర సేనాని తలవంచి సమరబాహుకు నమస్కరించాడు. అతడి వెనకగా తతిమ్మా సైనికులందరూ బిలం నుంచి బయిటికి వచ్చారు. వాళ్ళందర్నీ బిలం ముందున్న చిన్న మైదాన ప్రదేశంలో గుంపుగా ఒక చోట నిలబడమని సమరబాహు ఆజ్ఞ యిచ్చి, స్వర్ణాచారితో, "మహామంత్రీ, ఈ శత్రువుల్ని ఎలా శిక్షిద్దామంటారు?" అని అడిగాడు.

స్వర్ణాచారి కొంచెం సేపు ఆలోచించి, ఖడ్గ జీవదత్తులతో చిన్నగా ఏదో సంప్రతింపులు చేసి, సమరబాహుతో, "మహారాజా, వీళ్ళకు ఎలాంటి శిక్ష విధించాలన్నది, ఇక ముందు వీరపురరాజు మన విషయంలో అనుసరించబోయే విధానాన్ని



బట్టి వుంటుంది. ముందు వీళ్ళందర్నీ మన కొండకోటకు తీసుకుపోయి కారాగారంలో వుంచుదాం.'' అన్నాడు.

''సరి, సరి, మంచి ఆలోచన!'' అన్నాడు సమరబాహు. ఆ క్షణం వరకూ కేవలం బందిపోట్ల నాయకుడైన సమరబాహు మాటల్లోనూ, హావభావాల్లోనూ వచ్చిన రాజోచితమైన లక్షణాలు చూసి ఖడ్గ జీవదత్తులు ఆశ్చర్యపోయారు.

''చిన్న విజయం, పిసరంత అధికారం క్షణాల మీద బందిపోటు సమరబాహులో ఎంత మార్పు తెచ్చింది!'' అన్నాడు ఖడ్గవర్మ, జీవదత్తుడితో మెల్లిగా.

''నాకు, బందిపోటును రాజును చెయ్యబోతున్నాం అన్న అనుమానం కలుగుతున్నది. ఆ వీరపుర రాజుకు యీ సరికి మన శక్తి సామర్థ్యాలు చూసి గుండె దడ పుట్టినా పుట్టి వుండొచ్చు. అతడికి యీ పరిసరాలవున్న ఆటవికులంతా వ్యతిరేకులే. కనక, సమరబాహు కొండకోటలో రాజుగా స్థిరపడిపోయే సూచనలగుపిస్తున్నవి!'' అన్నాడు జీవదత్తుడు.

అల్లంత దూరంలో వున్న సమరబాహు, ఖడ్గ జీవదత్తుల దగ్గిరకు వస్తూ, ''క్షత్రియయోధుల్లారా! మీరేదో ఏకాంతంగా సంప్రతించు కుంటున్నట్టున్నది. ఇక మన కోటకు బయలుదేరి పోదామంటారా?'' అన్నాడు.

''రాజాజ్ఞకు తిరుగేముంది! అలాగే బయలుదేరదాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఒంటెల మీదా, గుర్రాల మీదా ఎక్కి సమరబాహు అనుచరులు కొందరు ముందూ, కొందరు వెనకా బయలుదేరారు. బందీలైన వీరపుర సైనికుల్ని మధ్యలో వుంచారు. రౌతుల్లేని కొన్ని ఒంటెలనూ, గుర్రాలనూ నడిపించుకుంటూ ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు నడిచారు. అందరి కన్న ముందు సమరబాహూ, స్వర్ణాచారీ, ఖడ్గ జీవదత్తులూ గుర్రాల నదిలిస్తూ ముందుకదిలారు.



అందరూ కొంతసేపటికి కొండకోటను చేరేసరికి, పర్వతం దిగువనున్న చెట్ల కింద ఒక చిన్న గుడారమూ, దానిముందు ఒక ఎత్తయిన ఆసనం మీద కూర్చుని వున్న ఒక వృద్ధుడూ, అతడి చుట్టూ చిన్న పరివారమూ ఖడ్గ జీవదత్తుల కంటబడింది.

"సమరబాహూ! ఇదేమిటి? స్వయంగా వీరపుర రాజే నీ తలపై కిరీటం పెట్టి, నిన్ను యీ ప్రాంతాలకు రాజుగా అభిషేకించటాని కిక్కడికి రాలేదు గదా?" అన్నాడు జీవదత్తుడు అశ్చర్యపడుతూ.

సమరబాహు ఏదో జవాబు చెప్పబోయేంతలో వృద్ధుడు ఆసనం దిగి ఇద్దరు సేవకులు వెంటరాగా, ఖడ్గ జీవదత్తుల కేసి ఎదురు రాసాగాడు. అది చూసి ఖడ్గ జీవదత్తులు గుర్రాలు దిగి అతడికి ఎదురు వెళ్ళారు.

వృద్ధుడు, వాళ్ళిద్దరి కేసీ చేయెత్తి శాంతి సూచకంగా అటూ యిటూ ఊపి, "నేను వీరపుర రాజుగారి మంత్రిని. మా చారులు వర్ణించిన దాంట్లో పొరబాటు లేకపోతే, మీరు మహాయోధులైన ఖడ్గ జీవదత్త నామధేయు లయివుంటారనుకుంటాను," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, ఆ వృద్ధుడికి నమస్కరించారు. జీవదత్తుడు, మంత్రితో, "మహామంత్రీ! చాలా కాలంగా అరణ్యాలు పట్టుకు తిరుగుతున్న మా ఇద్దర్నీ గురించీ చారుల ద్వారా మీరు శ్రమపడి చాలా సమాచారం సంగ్రహించి నట్టున్నది. అందుకు కారణం ఏమిటో మాకు అర్థంకావటం లేదు," అని, వెనక గుర్రం దిగివస్తున్న సమరబాహూనూ, స్వర్ణాచారినీ అతడికి చూపించి, "వీరు కొండకోట రాజుగారు సమరబాహు. ఆయన వారి మహామంత్రి, స్వర్ణాచారిగారు," అన్నాడు.

రాజూ, మంత్రీ అన్నమాటలు వింటూనే వీరపుర మంత్రి ముఖం చిట్లించి, అంతలోనే చిరునవ్వు నవ్వుతూ,



"ఈ రాజుగారు, మా సేనానినీ, సైనికులనూ ఎంత నేర్పుగా ఓడించి బందీలను చేశారో, యింతకు ముందే చారుల ద్వారా తెలుసుకున్నాను. స్వశక్తితో జయించుకున్న యీ ప్రాంతాలను సమరబాహు రాజుగారు నిశ్చింతగా ఏలుకోవచ్చు. ఈ మాట మా మహారాజుగారి పరంగా నేను చెపుతున్నాను. కాని, నేను వచ్చింది మీ ఇద్దరి కోసం....ఏకాంతంగా మాట్లాడాలి," అన్నాడు.

జీవదత్తుడు, సమరబాహూ, స్వర్ణాచార్లతో, "వీరపుర మహామంత్రిగారి మాటలు విన్నారు గదా? ఇక యీ కొండకోట రాజ్యపాలన గురించిన విషయాల్లో శ్రద్ధ వహించండి. వీరపుర సేనానినీ, సైనికులనూ స్వేచ్ఛగా వదలటానికి మీ కెలాంటి అభ్యంతరమూ వుండదనుకుంటాను," అన్నాడు.

సమరబాహు, స్వర్ణాచారి కేసి చూసి తలవూపాడు. స్వర్ణాచారి, వీరపుర మంత్రితో, "మహామంత్రీ! మీ రాజుగారు మరొకసారి మా మీదికి సైనికులను దాడికి పంపరన్న హామీ ఏమున్నది?" అని అడిగాడు.

"అలాంటి దాడి జరగదనీ, వీరపుర, కొండకోట రాజులు మిత్రులనీ మా రాజుగారు మీతో చెప్పమన్నారు. మా రాజుగారు అడినమాట తప్పరన్న ఘనకీర్తి గలవారు!" అన్నాడు వీరపురమంత్రి.

ఆ జవాబు సమరబాహును సంతృప్తి పరిచింది. అతడి ఆజ్ఞ కాగానే వీరపుర సేనానీ, సైనికులూ కాపలావాళ్ళ నుంచి విడిపించబడ్డారు. వాళ్ళు సంతోషంతో కోలాహలం చేస్తూ వచ్చి తమ మంత్రికి నమస్కారాలు చేశారు. వాళ్ళల్లో కొందరు సమరబాహుకూ, స్వర్ణాచారికీ కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

తాను ఇంత తేలిగ్గా రాజైనందుకు తన్మయుడై పోతూ సమరబాహు, వీరపుర సైనికులతో, "ఇవాళ మీరందరూ నాకు అతిథులు. రేపు ఉదయాన్నే

బయలుదేరి మీ రాజధానీ నగరానికి వెళ్ళిపోవచ్చు,'' అన్నాడు.

ఆ తరవాత సమరబాహు అనుచరులూ, ఎలుగ్గొడ్డు ముఠావాళ్లూ, వీరపుర సైనికులూ అజన్మ మిత్రుల్లా కబుర్లు చెప్పుకుంటూ, ఎకసక్కెలాడుతూ చెట్లకింద తిరగసాగారు. వీరపుర మంత్రి మాత్రం యివేవీ పట్టించుకోకుండా, ఖడ్గ జీవదత్తులను వెంట బెట్టుకుని కొంచెం దూరంగా పోయి, ''ఖడ్గ జీవదత్తుల్లారా, మిమ్మల్ని గురించిన సమాచారం మా చారుల నుంచి విన్నదానికన్న, ఒకానొక యక్షుడి వల్ల గడచిన రాత్రి యింకా ఎంతగానో తెలుసుకున్నాము,'' అన్నాడు.

''యక్షుడా? ఎవరా యక్షుడు?'' అంటూ జీవదత్తుడు ఎక్కడలేని ఆశ్చర్యం పొంది, ఖడ్గవర్మతో, ''ఖడ్గా, మంత్రిగారు చెప్పే యీ యక్షుడు పద్మపురం రాజకుమార్తె పద్మావతిని అపహరించుకుపోయినవాడు కాదు గదా?'' అన్నాడు.

ఖడ్గవర్మ కూడా ఆశ్చర్యంతో తల మునకలైవున్నాడు. వీరపుర మంత్రి వాళ్ళిద్దరికీ ఎలాంటి సమాధానం చెప్పకుండా ముందు నడుస్తూపోయి, ఎదురైన ఒక చిన్న గుట్ట మీద నిలబడి, దిగువనున్న నది కేసి చేయి చూపుతూ, ''ఖడ్గ జీవదత్తుల్లారా! రథాకారంలో నదిలో కనిపించే ఆ పడవను పరిశీలనగా చూడండి!'' అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, మంత్రి చెప్పిన పడవ కేసి చూశారు. అది తాము పద్మపురంలో విన్నదీ, అరణ్యపురంలో చూసిందీ అయిన రాతిరథం ఆకారంలో వున్నది. జీవదత్తుడు ఉత్సాహంగా తన చేతిలోని దండాన్ని పైకెత్తి పట్టుకుని, ''ఇన్నాళ్ళకు ఆ దుర్మార్గుడైన యక్షుడు మనతో ముఖాముఖి పోరాటానికి సన్నద్ధుడై వచ్చాడన్నమాట! బావుంది. మన శక్తి ఎలాంటిదో వాడికి చూపెడదాం,'' అంటూ నది కేసి బయలుదేరాడు.

—(ఇంకావుంది.)






# పరిస్థితుల ప్రభావం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు నిజంగా అసహాయశూరుడివి. ఇంకొకరి సహాయం లేకుండా నువు దుర్ఘటమైన పనికి ఒడిగట్టావు. చాలా మంది నీలదత్తుడి లాగా విఘ్నాలు ఎదురైనప్పుడు నిరుత్సాహపడి పోతారు. శ్రమ తెలియకుండా నీకు నీలదత్తుడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు :

చాలాకాలం క్రితం విజయపురి అనే నగరంలో సోమనాథుడు అనే నౌకా వ్యాపారి ఉండేవాడు. ఆయన దేశాంతరాలతో వ్యాపారం చేసి కోట్లు గడించాడు. సోమనాథుడి కొడుకు నీలదత్తుడు. నీల

## బేతాళ కథలు



దత్తుడికి యుక్తవయసు వచ్చే సమయానికి సోమనాధుడు తన నౌకల నిండా సరుకులు వేసుకుని సముద్రం మీద పోతూ ఉండగా మధ్యదారిలో తుఫాను వచ్చి, నౌకలన్నీ మునిగిపోయాయి. అనేక లక్షలు ఖరీదు చేసే సరుకుతో బాటు సోమనాధుడు కూడా పోయాడు.

రెండు సంవత్సరాలు గడిచాయి. సోమనాధుడు తిరిగి రాలేదు. అతని భార్య దిగులుతో మంచం పట్టి, కొంత కాలానికి మరణించింది. వర్తకంలో సోమనాధుడితో సంబంధాలు గల వర్తకులు దొంగలెక్కలు చూపెంచి, సోమనాధుడి ఆస్తి అంతా కాజేశారు. డబ్బుకు సంబంధించిన బాధ్యతలు ఏమీ పట్టించుకోకుండా ఆనందంగా జీవితం గడపటం మాత్రమే నీలదత్తుడు ఎరుగును. అందుచేత అతను తన తండ్రి ఆస్తిలో కొంచెం కూడా దక్కించుకునే ప్రయత్నం చెయ్యక, దిక్కులేని పక్షి అయిపోయాడు.

బికారిగా మిగిలిన నీలదత్తుడికి బంధువు లెవరూ సహాయం చెయ్యలేదు గాని, సోమనాధుడి బాల్య స్నేహితుడు నవకుబేరుడు అనే ఆయన అతన్ని చేరదీసి, తన ఇంట ఉంచుకుని అతనికి ఆశ్రయం ఇచ్చాడు.

నవకుబేరుడు ఆ దేశపు రాజుకు కుడి భుజంలాటివాడు. ఆయన తరచుగా రాజభవనానికి వెళ్ళి, రాజుగారితో మాట్లాడి వస్తూ ఉండేవాడు. ఆయన ఒకసారి నీలదత్తుణ్ణి తన వెంట రాజభవనానికి తీసుకుపోయినప్పుడు రాజకుమార్తె లావణ్యవతి అతన్ని చూసి, అతని అందానికి ముగ్ధురాలై, అలాటి వాడు తనకు భర్త అయితే తన జన్మ తరిస్తుందనుకున్నది. అతను ఒకప్పుడు గొప్ప ధనికుడనీ ప్రస్తుతం అతనికి ఏమీ లేదనీ, అతను నవకుబేరుడి పోషణలో ఉంటున్నాడనీ తెలిసి ఆమె అతనిపై ఎంతగానో జాలిపడింది.

నీలదత్తుడికి మాత్రం తన స్థితి తలచుకుంటే అసహ్యం వేసింది. నవకుబేరుడి ఇంట ఎంత కాలం ఉన్నా తన స్థితి మారదు. తాను స్వతంత్రంగా ఏదన్నా వ్యాపకం కల్పించుకోవాలన్నా తనది అంటూ చిల్లిగవ్వ కూడా లేదు. ఇంకొకరి నీడన బతుకుతున్నంత కాలమూ తనకు స్వేచ్ఛ కూడా లేదు. అందుచేత ఒక నాటి రాత్రి నీలదత్తుడు నవకుబేరుడి ఇంట కొంత ధనమూ, వజ్రాభరణాలూ తస్కరించి మూటకట్టుకుని, రహస్యంగా బయలుదేరాడు. ఆ ధనంతో గౌరవంగా బతకాలని అతని ఆలోచన.



కాని అతను ఆ రాత్రే నగర రక్షక భటులకు దొరికిపోయాడు. తాను ఎవరో, తన మూటలో ఉన్న వస్తువులు ఎక్కడివే, అర్ధరాత్రివేళ తాను వాటిని తీసుకుని ఎక్కడికి పోతున్నాడో నీలదత్తుడు చెప్పలేక పోవటం చేత, భటులు అతన్ని దొంగగా పరిగణించి, ఆ రాత్రికి అతన్ని కారాగృహంలో బంధించి ఉంచి, మర్నాడు రాజాస్థానానికి తీసుకుపోయి, రాజు ముందుపెట్టారు.

మూటలోని నగలు నవకుబేరుడి వని తేలిపోయింది. నీలదత్తుడు నవకుబేరుడి ఇంట తల దాచుకుంటున్న సంగతి రాజుకు తెలునును. విశ్వాసఘాతకుడూ, దొంగా అయిన నీలదత్తుడికి రాజు కఠినమైన శిక్ష ఇచ్చేవాడే గాని, నవకుబేరుడు స్వయంగా అడ్డుపడి, ఆ కుర్రవాణ్ణి క్షమించి వదలిపెట్టమని రాజును వేడుకున్నాడు. రాజు నీలదత్తుడికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు.

నవకుబేరుడు అతను దొంగిలించినదంతా నీలదత్తుడికి ఇస్తూ, "ఎక్కడ ఉన్నా క్షేమంగా బతుకు, బాబూ!" అన్నాడు.

రాజకుమార్తె నీలదత్తుడు దొంగగా పట్టుబడినందుకు అసహ్య పడలేదు గాని, అతనికి దేశబహిష్కారం జరిగినందుకు బాధపడింది.



నీలదత్తుడు విజయపురం వదిలి అవంతీపురం చేరి, అక్కడ కొంతకాలం వైభవంగా జీవించాడు. స్వతంత్రంగా బతకటానికి తాను ఏ వ్యాపకం పెట్టుకోవాలో నిర్ణయించుకునే లోపల అతని వద్ద ఉన్న డబ్బంతా అయిపోయింది. తరవాత అతను దొంగగా మారి, అందులో నైపుణ్యం సంపాదించి, గజదొంగగా తయారయాడు.

చోరవిద్యలో ఆరితేరిన అనంతరం నీలదత్తుడికి తన దేశం మీద బుద్ధి మళ్ళింది. అతను ఒక నాటి రాత్రి కాపలావాళ్ళ కన్ను కప్పి, విజయపురి ప్రవేశించాడు. అక్కడ అతను తన అచూకీ ఎవరికీ తెలియకుండా విజయవంతంగా దొంగతనాలు చేస్తూ కొంత కాలం గడిపాడు. ఒకనాడు అతనికి రాజకుమార్తెను చూడాలని పించింది. ఆ కోరిక తీర్చుకునేటందుకు ఒక రాత్రి రాజభవనంలో ప్రవేశించి, ఒక్కొక్క మందిరమే వెతుకుతూ కాపలా వాళ్ళకు దొరికిపోయాడు.

మర్నాడు రాజు అతన్ని విచారణచేసి, దేశబహిష్కరణను ఉల్లంఘించినందుకూ, దొంగతనం చెయ్యటానికి రాజభవనంలోకి ప్రవేశించినందుకూ నీలదత్తుడికి యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు. అతను గజదొంగగా తన రాజ్యంలోనే బతుకుతున్న సంగతి రాజుకు తెలియదు; తెలిస్తే అతన్ని ఉరితీయించేవాడే.

లావణ్యవతి అతన్ని గురించి విన్నది. ఆమె రహస్యంగా కారాగృహానికి వెళ్ళి, "నేను నిన్ను ఎలాగైనా విడిపిస్తాను, దేశం విడిచి వెళ్ళిపోతావా?" అని అడిగింది.

"రాజకుమారీ, నేను ఎక్కడా బతకలేను. నాకు ఏ పనీ చేతకాదు. అసమర్థుణ్ణి. అందువల్ల ఈ కారాగృహమే నాకు అన్నివిధాలా బాగున్నది." అన్నాడు నీలదత్తుడు.



రాజకుమార్తె కారాగృహాధికారికి లంచాలు పెట్టి, తరుచుగా వచ్చి నీలదత్తుణ్ణి చూస్తూ, అతనికి కారాగృహంలోనే అన్ని సదుపాయాలూ కలిగేటట్టు చూసింది. వారి మధ్య స్పష్టమైన ప్రేమ బంధం ఏర్పడింది. సంవత్సరం గడిచింది.

అవంతీపురరాజు రామసింహుడి పట్టపురాణి చనిపోయింది. లావణ్యవతి అంద చందాలను గురించి విని ఉండటం చేత ఆయన ఆమెను పెళ్ళాడి, తన పట్టమహిషిని చేయ నిశ్చయించాడు. ఆయన తరఫున అయన దూతవచ్చి, "అవంతీపురపు మహారాజుగారు మీ కుమార్తెను వివాహమాడ దలిచారు. మీరు నిరాకరించే పక్షంలో మీ దేశం మీద దండెత్తి వస్తారు," అని విజయపురి రాజుతో అన్నాడు.

అవంతీరాజు బలవంతుడు. ఆయనతో యుద్ధంచేసి గెలిచే అవకాశం విజయపురిరాజుకు ఏ మాత్రమూ లేదు. అందుచేత విజయపురి రాజు తన కుమార్తె అయిన లావణ్యవతిని రామసింహుడికి ఇచ్చి పెళ్ళి చెయ్యటానికి వెంటనే ఒప్పేసుకున్నాడు.

ఈ వార్త వినగానే లావణ్యవతికి నెత్తి మీద పిడుగుపడి నట్టయింది. రామసింహుడి వంటి వృద్ధుడికి భార్యకావటం కన్న చావే మేలని ఆమెకు తోచింది. ఆ రాత్రే ఆమె నీలదత్తుణ్ణి కారాగృహంలో కలుసుకుని, సంగతంతా అతనితో చెప్పి, "మనం పారిపోయి ఏ దూరదేశంలో నైనా సుఖంగా బతుకుదాం. నీ కభ్యంతరమా?" అని అడిగింది.

నీలదత్తుడు అందుకు సమ్మతించాడు. ఆ రాత్రే ఆ ఇద్దరూ విజయపురి వదిలి వెళ్ళిపోయారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, లావణ్యవతి అవివేకంగా నీలదత్తుడితో లేచిపోయి, భోగభాగ్యాలనూ, రాచ జీవితాన్నీ ఎందుకు దూరం చేసుకున్నది? అతను ఏ పనీ చేయలేని వాడని ఆమెకు

తెలియదా? పారిపోవటం కన్న యావజ్జీవ కారాగృహ శిక్షే బాగున్నదన్న నీలదత్తుడు, ఆమెను వెంట బెట్టుకుని పారిపోవటానికి ఎలా ఒప్పుకున్నాడు? ఆమెను ఎలా పోషింతామనుకున్నాడు? ప్రేమ వారిద్దరినీ గుడ్డివాళ్ళను చేసిందా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నీలదత్తుడు తాను ఏమీ చేతగాని వాడినని అన్నప్పటికీ రాజకుమార్తె తెలివిగలదైతే ఆ మాట నమ్మనవసరం లేదు. అతను అసమర్థుడైతే దేశబహిష్కరణ శిక్షను లక్ష్యపెట్టకుండా విజయపురికి తిరిగి రాడు. వచ్చినా రాజభవనానికి ఎన్నటికీ రాడు. అతను దొంగతనం చెయ్యటానికే వస్తే ఖజానా కేసి పోతాడుగాని, మందిరాలలో పట్టుపడడు. నీలదత్తుడు తనకు కారాగృహంలోనే సుఖంగా ఉన్నదనటానికి కారణం తాను అతన్ని రహస్యంగా చూడ రావటమే నని కూడా ఆమె తేలికగా గ్రహించగలదు. మీదు మిక్కిలి ఆమె అతన్ని ప్రేమించి ఉన్నదేమో, ముసలి రాజుకు భార్యగా ఉండటం కంటె నీలదత్తుడి భార్య అయి మామూలు జీవితం గడపటమే మేలనిపించ వచ్చు. ఆ మామూలు జీవితం ఎలా ఉంటుందో ఆమెకు తెలియదు గనక దాన్నిగురించి ఆమెకు భయం ఉండదు. ఇక నీలదత్తుడు రాజకుమార్తె సాన్నిధ్యం కోసం కారాగృహంలో ఉండగోరాడుగాని, ఆమె వెంట ఎక్కడికి పోవటానికైనా అతనికి అభ్యంతరం లేదు. ఆమెను అతను ఎలా పోషిస్తాడన్న సమస్యలేదు. అతను గజదొంగ. అతను పట్టుపడినది దొంగతనం చేస్తూకాదు. ఆ వృత్తి అతను ఏ దేశంలోనైనా సాగించగలడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)



# లోభి - పేద

ఒక ఊళ్ళో ఒక వడ్డీవ్యాపారస్థుడు ఉండేవాడు. వ్యాపారం మీద లక్షలకు లక్షలు గడించాడేగాని పరమ పిసినిగొట్టు. కడుపుకు కూడా తినకుండా ధనం ఇనపపెట్టెలో కూడబెట్టి, దాన్ని చూసుకుని మురిసి పోతూండేవాడు.

ఒకనాడు అతని వద్దకు ఒక పేదవాడు వచ్చి, తాను లోగడ తీసుకున్న డబ్బు తిరిగి ఇచ్చేస్తూ, "అయ్యా, నీకు ఇవ్వాలిసిన దానికన్న కొంచెం హెచ్చు ఇస్తాను. నీ ఇనప్పెట్టెలో డబ్బు ఒక్కసారి నన్ను చూడనిస్తావా?" అని అడిగాడు.

"సరే, చూస్తే ఏం పోయిందిలే? దానికి అదనంగా డబ్బు ఇస్తానంటున్నాడు. ఎందుకు పోగొట్టుకోవాలి?" అనుకుని వడ్డీవ్యాపారి తన ధనాన్ని చూపించటానికి ఒప్పుకున్నాడు.

ఆ పేదవాడు ధనికుడి ఇనప్పెట్టెలో ఉన్న ధనం చూసి, "అయ్యా, ఇప్పుడు నేనూ నీ అంత ధనవంతుణ్ణి అయానన్నమాట!" అన్నాడు.

"ఏమిటి అలా అంటున్నావు?" అని ధనికుడు అడిగాడు.

"ఆ డబ్బును చూసుకోవటం తప్ప నువు చేస్తున్నదేమిటయ్యా? దాన్ని నేనూ చూశాను. తిండీ, బట్టా వగైరా విషయాల్లో నీ కన్నా నేనే నయం!" అంటూ పేదవాడు శలవు పుచ్చుకున్నాడు.

—పగడాల జనార్దన్‌రావు.





# కాన్స్టేబుల్ విచారణ

ఉగ్రగుప్త మహారాజు రాజధాని అయిన మిలన్‌గఢ్ చాలా అందమైన నగరం. అందులో చక్కని భవనాలూ, శుభ్రమైన వీధులూ, ఆహ్లాదకరమైన కోనేరులూ, ఉద్యానాలూ ఉండేవి. ప్రజలు సుఖ సౌభాగ్యాలు కలవారు. ఉగ్రగుప్తుడు ఇరుగు పొరుగు దేశాలతో సఖ్యత కలిగి ఉండటం చేత ఆ దేశానికి కరువు కాట కాలూ, యుద్ధ భయాలూ లాటి ఈతి బాధలు లేవు.

మిలన్‌గఢ్‌లో ఆ రోజు దీపావళి. ఆ రాత్రి అన్ని ఇళ్ళ మీదా, ఉద్యానాల లోనూ, వీధుల లోనూ దీపాలంకరణ జరిగింది. రంగుల తోరణాలు కట్టి ఉన్నాయి. నగరమంతా వేడుకలో మునిగి ఉన్నది.

రాజభవనంలో ప్రతి గవాక్షంలోనూ, నడవలోనూ, గూట్లోనూ కొవ్వొత్తులు వెలిగించి పెట్టారు. అది నక్షత్ర భవనం లాగా, చూడ ముచ్చటగా ఉన్నది. వినోదశాలలో ఉగ్రగుప్త మహా రాజు ఆస్థాన గాయకులతో సహా పాడు తున్నాడు. ఆయన గానవిద్యలో ప్రవీ ణుడు. ఆయనకు ఇంద్రజాల విద్యతో సహా అనేక విద్యలలో ప్రావీణ్యం ఉన్నది. వినోదశాల పురప్రముఖులతో క్రిక్కిరిసి ఉన్నది.

అకస్మాత్తుగా ఎవరో కెవ్వున అరచిన ధ్వని వినిపించింది. అదే ధ్వని మరొక సారి వినిపించే సరికి సేవకులు మొదలు కొని అందరూ భయభ్రాంతు లయారు. అలా అరిచినది ఎవరో త్వరలోనే స్పష్ట మయింది. ఉగ్రగుప్తుడి ఏక పుత్రుడైన రాకుమారుడు నారాయణ ఉండే గది నుంచి ఆ ధ్వని విన వచ్చింది. ఆ కుర్ర వాడు తన గదిలో ఒక మూల ఒదిగి,

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు




తన కుడిచేతిని ఎడమ చేత్తో పట్టుకుని భయపడి, బాధలో ఉన్నాడు. అతను ఏడేళ్ళ కుర్రవాడు. మృదు స్వభావుడైన ఆ కుర్రవాడంటే అందరికీ ఎంతో ప్రీతి. అతని దాది దిగ్భ్రమ చెంది, పాలి పోయిన ముఖంతో పక్కగా నిలబడి ఉన్నది.

ఉగ్రగుప్తుడు దాదిని, "ఏం జరిగింది?" అని అదుర్దాగా అడిగాడు. రాణీ తన కొడుకును ఒడిలోకి తీసుకున్నది.

దాది భయంతో గొంతు మూసుకుపోయి, "అబ్బాయిగారు వేలు కాల్చుకున్నారు," అన్నది.

"నువు ఏం చేస్తున్నావు? బిడ్డను కనిపెట్టి ఉండ నక్కర్లేదూ?" అని రాజు ఆమెను తీవ్రంగా అడిగాడు.

"అవును, మహారాజా. నేను అతని వెంటనే ఉన్నాను. ఆ కిటికీలో నుంచి అతను నగరంలోని దీపాలంకరణ చూస్తుంటే, నేను వెనకనే నిలబడ్డాను. ఉన్నట్టుండి అబ్బాయిగారు పనిపెట్టుకుని మంటలో వేలుపెట్టి, 'చూడు, దాయమ్మా, ఇది నక్షత్రంలాగా వెలగటం లేదూ?' అన్నారు. కొవ్వొత్తి కిటికీ అంచునే ఉన్నది. నేను ఆపేలోపునే చెయ్యి కాలింది; అబ్బాయిగారు ఈ మూలకు చేరి, భయంతో వణుకుతున్నారు. నన్ను మన్నించండి, మహారాజా!" అన్నది.

వైద్యుడు వచ్చి కాలిన వేలికి మందు పూశాడు. రాణీ కుర్రవాణ్ణి బుజ్జగించుతూ, అతన్ని మరిపించాలని కిటికీ వద్దకు తీసుకుపోయి, నగర దీపాలు చూప యత్నించింది. కుర్రవాడి బాధ తగ్గిపోయింది గాని, వాణ్ణి మరిపించటం సాధ్యం కాలేదు.

"ముందు కిటికీలో నుంచి ఆ దిక్కుమాలిన కొవ్వొత్తి తీసేయండి. లేకపోతే నేను కిటికీ దగ్గిరికి పోను," అన్నాడు కుర్రవాడు.



కనిపించ కూడదు.'' అంటూ నారాయణ ఉద్రేకపడి, ఆవేశంతో దగ్గిర ఉన్న వస్తువులన్నీ విసిరేసి, పగలగొట్ట సాగాడు.

ప్రధానమంత్రి ఉగ్రగుప్తుణ్ణి సమీపించి, "మహారాజా, ఆకస్మికంగా కలిగిన ఆపదతోనూ, భయంతోనూ అబ్బాయిగారి నరాలు దెబ్బతిన్నాయి. అతనికి కొవ్వొత్తుల పైన కసి పట్టుకున్నది. ఈ భయాన్ని ఇప్పుడే పోగొట్టకపోతే, దీని దుష్ఫలితం అజన్మాంతం ఉంటుంది. వెలిగే కొవ్వొత్తు లంటే అబ్బాయిగారికి భయం లేకుండా చెయ్యాలి. ఏదైనా మార్గం ఆలోచించండి,'' అన్నాడు.

ఉగ్రగుప్తుడు దీర్ఘంగా ఆలోచించాడు. కాని ఆయనకు ఏం చెయ్యటానికీ పాలు పోలేదు.

"మీకు తెలిసిన ఇంద్రజాలం ఏదైనా ప్రయోగించరాదా, మహారాజా?" అన్నాడు రామమోహనుడు అనే సభికుడు.

"మంచి ఆలోచనే చెప్పావు, రామమోహన్. ఇంద్రజాలం చేసి చూద్దాం,'' అన్నాడు ఉగ్రగుప్తుడు.

ఆయన కొంచెంసేపు ఆలోచించి, తన కొడుకు వద్దకు వెళ్ళి, "నువు చెప్పినది నిజమే, బాబూ. రాజభవనం నుంచి కొవ్వొత్తులను బహిష్కరించవలసిందే. ఒక్క రాజభవనం నుంచే ఏమిటి? మన

"నీ వేలు ఇంక కాలదు గద, బాబూ? నువు వెళ్ళి ఆ మంటలో వేలుపెట్టవుగా?" అన్నది రాణి మృదువుగా.

"వద్దమ్మా, నేను కొవ్వొత్తి కేసి ఇంక చూడనే చూడను. అన్ని కొవ్వొత్తులూ అవతల పారెయ్యండి. రాజభవనంలో కొవ్వొత్తి అన్నది ఉండరాదు,'' అన్నాడు నారాయణ.

"నాయనా, కొవ్వొత్తులు లేకపోతే దీపాలుండవు. దీపాలు లేకపోతే చీకటే గద! ఎల్లకాలమూ చీకట్లో ఉంటావా, బాబూ?'' అన్నాడు ఉగ్రగుప్తుడు.

"నా కదంతా తెలీదు. నా దగ్గిర కొవ్వొత్తులు ఉండరాదు. నాకు అవి



రాజ్యం నుంచే బహిష్కరించాలి. అవి చాలా చెడ్డవి. అవి మా చిట్టితండ్రి వేలు కాల్చాయి. ఏమంటారు, మంత్రిగారూ?" అని దాపులనే వున్న మంత్రికి కన్ను మలిపాడు.

"నిజమే, మహారాజా. మన రాజ్యంలో కొవ్వొత్తులు ఉండరాదు. అవి చాలా చెడ్డవి," అన్నాడు మంత్రి, రాజు ధోరణి గ్రహించి.

ఈ మాటలు విన్న మీదట రాజకుమారుడి ఆరాటం చాలావరకు తగ్గిపోయి, సంతృప్తి కలిగింది. రాజు ఆ కుర్రవాణ్ణి తన ఒడిలోకి తీసుకుని, "చూడు, నాయనా! నేను రాజును. రాజు అయినవాడు విచారణ జరపకుండా ఎవరినీ దండించరాదు. అందుచేత కొవ్వొత్తులకు విచారణ జరపాలి. వాటిలో మంచి గుణాలు కూడా ఉన్నాయేమో చూడాలి. అవి నీకు వినోదం కలిగించి, ఆనంద పరిచే పక్షంలో వాటిని దయదలిచి, శిక్షించకుండా వదిలివేయటం మంచిది. ఏమంటావు?" అన్నాడు.

రాజకుమారుడు తండ్రి చెప్పిన మాటలకు జవాబు చెప్పక, గంభీరంగా ఉండిపోయాడు.

ఉగ్రగుప్తుడు తన ఖజానా నుంచి ఒక లావుపాటి కొవ్వొత్తి తెప్పించాడు; దాని రెండవ చివర కూడా సన్నగా చెక్కించి, వత్తి బయటికి తెప్పించి, రెండు చివరలా వెలగటానికి వీలుగా తయారు చేయించాడు. తరవాత ఆయన ఒకే ఎత్తుగల రెండు గాజు లోటాలు తెప్పించి, కొవ్వొత్తి నడుమకుండా ఒక నిడుపైన సూది గుచ్చి, ఆ సూదిని రెండు లోటాల మీద మోపి, కొవ్వొత్తి లోటాల మధ్య అడ్డంగా ఉండేటట్టు అమర్చాడు. తరవాత ఆయన కూర్చున్న పిల్లల ఆకారాలను అట్టలో కత్తిరింపించి, వాటికి తగిన రంగులు వేయించి. ఆ అట్ట బొమ్మలను గుండు సూదులతో కొవ్వొత్తి రెండుపక్కలా, కొవ్వొత్తుల కొసలు కనపడకుండా

గుచ్చాడు. అయితే కొవ్వొత్తిని వెలిగించి నప్పుడు దాని మంటలకు అట్టబొమ్మలు తగలబడకుండా తగినంత దూరంలో ఉండేటట్టు చేశాడు. తరవాత ఆయన కొవ్వొత్తి రెండు చివరలా వెలిగించి, తన కొడుకుతో, "దీని కేసి జాగ్రత్తగా చూడు, బాబూ. ఈ కొవ్వొత్తి నీకేమైనా వినోదం కలిగిస్తుందేమో చెప్పు." అన్నాడు.

చిత్రం! కొవ్వొత్తి సీ-సా లాగా అటూ ఇటూ ఊగసాగింది. దానితోబాటు పిల్లల బొమ్మలు ఒకటి పైకిపోతే ఒకటి కిందికి వస్తూ ఏతాం లాగా పైకీ కిందికీ ఊగ సాగాయి. ఒక్కొక్క చివరనుంచీ కొవ్వొత్తి కరిగి, చుక్కలు రాలుతూ ఉంటే పిల్లల బొమ్మలు పైకీ కిందికీ ఊగటం ఆగకుండా సాగింది. చూడటానికది ఎంతో వినోదంగానూ, చిత్రంగానూ, అద్భుతంగానూ ఉన్నది.

రాజకుమారుడు చప్పట్లు చరిచి గట్టిగా నవ్వాడు. అతను దగ్గిరికి వచ్చి, ఈ కొత్త ఆటవస్తువును చేత్తో తాకి, "అద్భుతం!" అన్నాడు.

"ఇప్పుడేమంటావు? మన భవనంలో వున్న కొవ్వొత్తులన్నిటినీ తెప్పించి అవతల పారేద్దామా, బాబూ?" అని రాజు అడిగాడు.

"అన్నిటిలోనూ మంచీ, చెడూ ఉంటుంది, నాన్నగారూ. ఇకముందు నేను కొవ్వొత్తి మంటతో వేళ్ళు కాల్చుకో కుండా జాగ్రత్తగా ఉంటానులెండి," అన్నాడు నారాయణ.

రాజు తీర్పులిచ్చే గొంతుపెట్టి, "తీర్పు ఇచ్చేస్తున్నాం. కొవ్వొత్తిని నిర్దోషిగా పరిగణించటమైనది. ఇకముందు కొవ్వొత్తులు స్వేచ్ఛగా అన్ని ఇళ్ళలోనూ వెలుగుతూ, అంధకారాన్ని పోగొట్టుతవి గాక!" అన్నాడు.

ఉగ్రగుప్తమహారాజు యిచ్చిన ఈతీర్పు విని సభలో వున్న అందరితో బాటు నారాయణ కూడా చప్పట్లు చరిచి, హర్షం ప్రకటించాడు.





# ఆకలి మందు

ఒక దేశంలో ఒక ఏడు కరువు ఏర్పడింది. ఆ దేశపురాజు మంత్రులనూ, తదితర ప్రభుత్వోద్యోగులనూ సమావేశపరచి, "మన దేశంలో క్షామదేవత విలయ తాండవం చేస్తున్నది. ఆకలి చావులు రోజురోజుకూ ఎక్కువై పోతున్నాయి. ఆకలిని శాశ్వతంగా నివారించేటందుకు వైద్యుల చేత ఆకలి కలగకుండా మందు తయారుచేయిస్తాను," అన్నాడు.

ఏ మంటే ఏమి ముంచు కొస్తుందో నని సభికులు ఏమీ అనకుండా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

వృద్ధ మంత్రి సుబుద్ధి మాత్రం, "మహారాజా, మన దేశానికి కరువు కొత్తది కాదు. ప్రతి ఏడూ దేశంలో ఏదో ఒక ప్రాంతంలో కరువు ఏర్పడుతూనే ఉన్నది. దాన్ని నివారించాలంటే, నీటి పారుదల సౌకర్యాలు పెంచి దేశాన్ని సస్యశ్యామలం చెయ్యాలి. అంతేగాని ఆకలిమందుతో క్షామాన్ని అరికట్టటం జరిగేపని కాదు," అన్నాడు.

"ఎందుకు జరగదో నేనూ చూస్తాను," అంటూ రాజు ముసలి మంత్రి మీద విరుచుకుపడ్డాడు.

ఆయన మంత్రిని శకునపక్షి అనీ, తాను అనుకున్న ప్రతి ఆలోచనకూ అభ్యంతరం చెబుతాడనీ అన్నమీదట, మిగిలిన వాళ్ళంతా రాజుగారి ఆలోచన దివ్యంగా ఉందన్నారు.

రాజు దేశంలోని వైద్యులందరినీ పిలిపించి, "మీకు ఒక నెలరోజులు గడువిచ్చాను, ఆకలికి మందు తయారు చెయ్యండి," అన్నాడు.

వైద్యులు నిర్ఘాంతపోయారు. వారిలో ఒకరు, "ప్రభువులు క్షమించాలి. ఆకలి కలగకుండా చెయ్యటానికి ఔషధం

వలమేటి సుందరరామయ్య

ఏ వైద్యగ్రంథంలోనూ చెప్పబడ లేదు.'' అన్నాడు.

''అయితే మీరు తయారు చేయ లేరన్నమాట....ఈ నకిలీ వైద్యులందరినీ కారాగృహంలో బంధించండి. వీళ్ళంతా నిష్ప్రయోజకులు.'' అన్నాడు రాజు రౌద్రంగా తన సేనానితో.

ఒక ముసలివాడు ముందుకు వచ్చి, ''మహారాజా, ఈ వైద్యులను విడుదల చేయించండి. ఒక వారం రోజులలో నేను మీరు కోరిన ఔషధం తయారు చేసి ఇయ్యగలను.'' అన్నాడు.

''వైద్యుడంటే అలా ఉండాలి.'' అని రాజు వైద్యులందరినీ విడుదల చేయించాడు.

తరవాత కొన్ని రోజులకు ఆ ముసలి వాడే రాజు వద్దకు వచ్చి, తాటికాయ ప్రమాణమంత మందు తెచ్చి ఇచ్చి, మనిషికి ఒక గురిగింజ ఎత్తు ఆ మందు తినిపించినట్టయితే జన్మలో మళ్ళీ ఆకలి ఉండదన్నాడు.

రాజు ఆ లేహ్యాన్ని అందుకుని, ముసలి వాణ్ణి సన్మానించి, ఆ లేహ్యాన్ని నగర వాసులకు పంచాడు. రాజప్రాంగణంలో ఎవరూ మందు తినలేదు గనక వారికి ఆకలి మామూలుగానే ఉండిపోయింది. కాని నగరంలో అందరికీ ఆకలి పోయినట్టు వార్త వచ్చింది.

వృద్ధ మంత్రి రాజు వద్దకు వచ్చి, ''మహారాజా, ప్రజలు పనిపాటలు మానే



శారు. వారి కిప్పుడు ఆకలి బాధలేదు గనక, ఎంతసేపూ వినోదాలలోనూ, వేడుకలలోనూ, నిద్రలోనూ కాలం గడుపుతున్నారు. చిన్నా, పెద్దా తారతమ్యం పోయింది." అన్నాడు.

"అన్నిటి కన్న పెద్దది, ఆకలి సమస్య పోయింది గదా!" అన్నాడు రాజు.

మరిరెండు రోజులకు మంత్రి రాజుతో, "మహారాజా, అందరూ కులవృత్తులు మానేశారు. నేతగాళ్ళు బట్టలు నెయ్యటం లేదు. మంగళ్ళు క్షురకర్మ చెయ్యటం లేదు. ప్రజలు గడ్డాలూ మీసాలూ పెరిగి అరణ్య మృగాలలాగా ఉన్నారు. అన్ని వస్తువులకూ కరువు ఏర్పడింది. వెనక తిండి గింజలు మాత్రమే లేవు. ఇప్పుడు ఏ వస్తువూ దొరకటం లేదు. దొరికితే ఎత్తు కెత్తు బంగారం పోసి కొనవలిసి వస్తున్నది." అన్నాడు.

రాజు ఈ మాటలు విని, ఏమీ అనకుండా ఊరుకున్నాడు.

మరో రోజు మంత్రి రాజుతో, "మహారాజా, ప్రజలు శాసనధిక్కారం చేసి, తిరగబడుతున్నారు. అరాజకం ఏర్పడుతున్నది." అన్నాడు.

రాజుకు కోపం వచ్చింది. "ప్రజలు ఇంత కృతఘ్నులా? సైన్యాన్ని సిద్ధంగా ఉంచమని సేనాపతికి చెప్పండి." అన్నాడు ఆయన.

"ఇంకా మనకు సేన ఎక్కడున్నది, మహారాజా? సైనికులలో చాలా భాగం



కొలువు చాలించుకుని వెళ్ళిపోయారు,'' అన్నాడు మంత్రి.

ఇంతలో సేనాపతి కంగారుపడుతూ వచ్చి, ''మహారాజా, మన విరోధి చండ ప్రచండుడు తన సేనలతో వచ్చి, మన రాజధానిని చుట్టుముట్టాడు,'' అని చెప్పాడు.

''ఇప్పుడు ఏం చేసేటట్టు?'' అన్నాడు రాజు ఆదుర్దాగా.

''శత్రువుకు లొంగిపోవటం తప్ప గత్యంతరం లేదు, మహారాజా,'' అన్నాడు సేనాపతి.

అతను ఇలా అంటూండగానే శత్రు సైనికులు వచ్చారు. వాళ్ళనాయకుడు రాజును సమీపించి, ''మీ రాజ్యం మాకు హస్తగతమయింది. అనవసరంగా ప్రతిఘటించి ప్రాణాలకు ముప్పు తెచ్చుకోవద్దు,'' అన్నాడు.

''ఇంకెక్కడి ప్రతిఘటన? ఈ ఆకలి మందు నన్ని గతికి తెచ్చింది. నే నిప్పుడు మీకు బందీని,'' అంటూ రాజు కదిలాడు.

అంతలో ఊతకర్ర పొడుచుకుంటూ ముసలి వైద్యుడు వచ్చి, ''ఆకలి మందు అన్ని అనర్థాలకూ మూలమని నేను చెబితే విన్నారా, మహారాజా ?'' అన్నాడు.

''అందుకే అనుభవిస్తున్నాను,'' అన్నాడు రాజు.

''ఇప్పటికైనా అసలు విషయాన్ని గ్రహించారు. సంతోషం!'' అంటూ వైద్యుడు తన వేషాన్ని తీసేశాడు. ఆయన మంత్రి సుబుద్ధే!

''ప్రభువులు క్షమించాలి. మంత్రాలకు చింతకాయలు రాలవు. మందు మాకులతో ఆకలి సమస్య తీరదు. మీ చేత సరి అయిన ప్రణాళికలు అమలు జరిపించాలని ఈ నాటకం ఆడాం. శత్రుసైనికులందరూ మన సైనికులే. మీరు ఎవరికీ బందీ కారు. దేశసంపదను సద్వినియోగం చెయ్యటానికి ప్రణాళికలు తయారు చేయించి, దేశాన్ని సస్యశ్యామలం చేసి, కాటకాన్ని రూపు మాపండి,'' అన్నాడు మంత్రి సుబుద్ధి.





# మూడుకాన్ల పుణ్యం

ఒక గ్రామంలో సుబ్బిశెట్టి అనే వ్యాపారస్థుడు ఉండే వాడు. అతని ప్రాణానికీ డబ్బుకీ లంకె. అతని భార్య మీనాక్షికి భర్త పిసినారితనం నచ్చేది కాదు, కాని భర్త బుద్ధి తెలిసి, సాధ్యమైనంత వరకు డబ్బు ఖర్చు చేసేది కాదు. అయితే ఆమె ధర్మకార్యం ఏదైనా చెయ్యదలచినప్పుడు భర్త చేత పట్టుబట్టి ఖర్చు చేయించేది.

అనుభవించటానికి బోలెడంత డబ్బు ఉంది కూడా; శెట్టి దంపతులకు సంతానం లేకపోవటం తీరని లోటుగా ఉండేది. పిల్లల కోసం మీనాక్షి చాలా దేవుళ్ళకు మొక్కింది, పూజలూ, పుణ్యాలూ చేసింది. వాటికి శెట్టి అభ్యంతరం చెప్పలేదు, కాని అవేవీ ఫలించలేదు. చివరకు మీనాక్షి, ప్రాణం విసిగి, తనకు సంతానం కలిగితే దేవుడికి నిలువుదోపిడీ ఇస్తాననీ, తన భర్తకు వ్యాపారంలో ఒక ఏడు వచ్చిన లాభంలో పైసా వాటా హుండీలో వేస్తాననీ మొక్కింది.

మీనాక్షి ఇలా మొక్కుకున్న కొద్ది రోజులకు గర్భం ధరించి, కాలక్రమాన పిల్లవాణ్ణి కన్నది. ఆ తరవాత ఆమె శెట్టికి తను దేవుడికి మొక్కుకున్న మాట చెప్పింది.

శెట్టి అదిరిపడి, "నీకేమైనా మతి పోయిందా? నిలువు దోపిడి అంటే ఎంత లేదన్నా రెండు మూడు వేలు ఉంటుంది. ఆ పైన లాభంలో పైసా వాటా అంటే ఏమిటనుకున్నావు? మళ్ళీ ఆ మాట ఎత్తకు," అన్నాడు.

మీనాక్షి నడుము బిగించి, "ఇదుగో, ఈ విషయంలో మాత్రం నువు కాదనటానికి వీల్లేదు. ఇది దేవుడితో కూడిన వ్యవహారం. బిడ్డకేదన్నా అనర్థం జరి

బూర్లె నాగేశ్వరరావు



గిందో, నా శవం కళ్ళజూస్తావు!" అన్నది, కోపంగా.

శెట్టి మారు మాటాడక అంగీకరించాడు. దేవుడు కోపిష్ఠి అని అతనికి భయం ఉన్నది.

"ఈ సారికి నీ మొక్కు చెల్లిస్తాగాని, ఇంకెన్నడూ డబ్బుతో కూడిన మొక్కులు మొక్కుకోకు," అన్నాడతను.

"నాకు తెలీదా?" అన్నది మీనాక్షి.

కొద్ది రోజుల అనంతరం శెట్టి భార్యతోనూ, బిడ్డతోనూ దేవుడి దగ్గిరికి ప్రయాణమయాడు. మీనాక్షి నిలువు దోపిడీకి అవసరమైన నగలు ధరించింది. లాభంలో పైసా వంతున దేవుడికి చెల్లించవలసినది వెయ్యి రూపాయలని శెట్టి లెక్క తేల్చాడు.

"లెక్కల విషయంలో పొరపాటు చెయ్యవద్దు," అని మీనాక్షి అతన్ని హెచ్చరించింది.

దారి ఖర్చులకు మరో వెయ్యి చేత బుచ్చుకుని శెట్టి ప్రయాణమయాడు. ఇంటికి తాళం పెడుతూండగా శెట్టికి వీధి అరుగు మీద తిష్ఠవేసిన ఒక బైరాగి కనిపించాడు.

"శుభమా అని ప్రయాణం అవుతూండగా ముందు ఈ బైరాగి వెధవ తారసిల్లా డేమిటి?" అని శెట్టి వాణ్ణి తిట్టుకున్నాడు.

శెట్టితో బైరాగి, "అయ్యా, పుణ్య క్షేత్రాలకు వెళ్ళేటప్పుడు దానధర్మాలు చేసి బయలుదేరాలి. రాత్రి నుంచీ తిండి లేదు. ఏమైనా ఉంటే పెట్టించండి," అన్నాడు.

"ఆపవయ్యా! నీ బోడి హితబోధ ఎవడికి కావాలి? నీ బోడి మూడు కాన్ల పుణ్యం నాకేమీ అక్కర్లేదు. వేల రూపాయలు ధారపోసి, దేవుడి నుంచి బోలెడంత పుణ్యం సంపాదించుకోబోతున్నాను," అన్నాడు శెట్టి.

శెట్టి మాటలు విని మీనాక్షి చీదరించుకున్నది. ముందు పోతున్న భర్త చూడ

కుండా సంచీలో నుండి రెండు లడ్డూలు తీసి బైరాగి బొచ్చెలో పడవేసి, రొండి నుంచి మూడు కాన్లు చిల్లర డబ్బులు తీసి ఇచ్చింది.

మీనాక్షి బైరాగికి డబ్బు లివ్వటం శెట్టి చూడనే చూశాడు. ఆయన మీనాక్షి మీద మండిపడుతూ, "డబ్బంతా ఇక్కడే ఖర్చు పెడుతున్నావు. వచ్చే టప్పుడు అడుక్కు తింటూ రావాలి, తెలిసిందా?" అన్నాడు.

"పోనీ లెండి! ఆ బైరాగి పొద్దుటనగా వచ్చి కూర్చున్నాడు. ఇంత తిండి పెట్టక పోయినా, మూడు కాన్లు చిల్లర ఉంటే ఇచ్చాను," అన్నది మీనాక్షి.



పుణ్యక్షేత్రం చేరగానే కోనేట్లో స్నానం చేసి, ఆలయంలోకి వెళ్ళబోతూ శెట్టి మీనాక్షి చేతికి వెయ్యిరూపాయలు ఇస్తూ, "నా దగ్గిర మరో వెయ్యి ఉన్నది. ఒక వెయ్యి హుండీలో వేసి, రెండోది మన దారి ఖర్చుల కోసం ఉంచుదాం," అన్నాడు.

"అలాగే," అన్నది మీనాక్షి.

దైవదర్శనం అప్పుడు మీనాక్షి నిలువు దోపిడీతో బాటు భర్త ఇచ్చిన వెయ్యి రూపాయలూ హుండీలో వేసింది. ఈ సంగతి తెలియక శెట్టి తన వద్ద ఉన్న వెయ్యి రూపాయలు కూడా హుండీలో వేసేశాడు.

ఇద్దరూ బయటి కొచ్చిన తరవాత శెట్టి మీనాక్షితో, "డబ్బు జాగ్రత్త సుమా! అంతా దొంగలే!" అన్నాడు.

"డబ్బు మీ దగ్గిర ఉంచుకుని నన్ను జాగ్రత్త అంటారేమిటి?" అన్నది మీనాక్షి, ఆశ్చర్యపోతూ.

వెంటనే జరిగిన పొరపాటు తెలిసి పోయింది. శెట్టి ఆలయం అధికారుల ద్వారా, పొరపాటున హుండీలో వేసిన అదనపు వెయ్యి తిరిగి సంపాదించు కోవాలని చూశాడు, కాని ప్రయోజనం లేకపోయింది.

మీనాక్షి అతనితో, "మీరేదో అపచారం చేశారు. లాభాల్లో దేవుడి కివ్వవలసిన

వాటాలో దొంగ లెక్కలుగాని వెయ్యలేదు గద?" అన్నది.

శెట్టి తలదించుకున్నాడు.

ఇద్దరి వద్దా మిగిలిన చిల్లర ఒక రోజు ఖర్చుకు కూడా చాలదు. దారిలో ఉపవాసాలు చేస్తూ, అవకాశం ఉన్నప్పుడు యాచిస్తూ, అష్ట కష్టాలూ పడి, వాళ్ళు ఇల్లుచేరారు. చాలా రోజులకు తిరిగి వచ్చిన శెట్టిని చూడటానికి అనేక మంది వచ్చారు. చిత్రమేమి టంటే, వాళ్ళు బయలుదేరే టప్పుడు కనిపించిన బైరాగి ఇంకా అక్కడే ఉన్నాడు.

ఆ బైరాగి శెట్టికి ఎదురువచ్చి, "అయ్యా, ప్రయాణం బాగా సాగిందా?" అని అడిగాడు.

శెట్టి చిరాకుగా, "ఆ, ఆ! బాగానే సాగింది. దారి పొడుగునా అడుక్కు తింటూ వచ్చాం. సరేనా?" అన్నాడు.

"అది మీరు వెళ్ళే ముందు అన్న మాటేగా? వస్తా!" అంటూ బైరాగి అక్కడి నుంచి కదిలాడు.

"తనకు మాలిన ధర్మం చేసినందుకు ఆ బైరాగి వాడికి బాగా అయింది!" అన్నది ఒకావిడ.

"ఎందుకు అలా అన్నారు?" అని శెట్టి ఆమెను అడిగాడు.

"ఎందుకా? మీరు వెళ్ళిన దగ్గిర నుంచీ ఆ బైరాగి మీ ఇంటికి కుక్క కాపలా కాచాడు. మొన్న రాత్రి మీ ఇంట్లో దొంగలు పడబోతున్నప్పుడు బైరాగి చూసి, కేకలు పెట్టి నలుగురినీ పిలిచాడు. దొంగలు పారిపోయారు. మీరేమో ఆ బైరాగిని దొంగను చూసినట్టు చూస్తున్నారాయె!" అన్న దామె.

"మూడు కాళ్ల బోడి పుణ్యం మన సర్వస్వాన్నీ కాపాడింది," అన్నది మీనాక్షి భర్తముఖంలోకి చూసి.

శెట్టి తన అవివేకానికి చాలా సిగ్గు పడ్డాడు. ఆ తరవాత అయన దాన ధర్మాలు చెయ్యటం కోసం డబ్బుకు వెనకాడక, ఆ చుట్టుపక్కల మంచి పేరు తెచ్చుకున్నాడు.



# ఫలించని యుక్తి

ఒక పేద రైతుకు పాడిఆవు ఉండేది. ఆ ఆవు మీద ఊరి పురోహితుడు కన్ను వేశాడు. ఇంతలో రైతు తండ్రి పోయాడు. కర్మకాండ ముగిసినాక పురోహితుడు రైతుతో, "చూడూ, మీ నాన్న ఉత్తమ లోకాలకు వెళ్ళేదారిలో వైతరణీ నది దాటాలి. ఆ నదిలో భయంకరమైన జంతువులుంటాయి. అది దాటితేగాని ఉత్తమ లోకాలకు పోయే అవకాశం ఉండదు. నువు బ్రాహ్మడికి మంచి పాడిఆవును దానం చేస్తే ఆ ఆవుతోక పట్టుకుని మీ నాన్న వైతరణిని దాటుతాడు," అన్నాడు.

రైతు తన పాడిఆవును పురోహితుడికే దానం చేశాడు. దాన్ని అతనే తీసుకుపోయి పురోహితుడి ఇంట కట్టివచ్చి, తండ్రి చచ్చినదానికన్న ఆవు పోయినందుకు ఎక్కువ బాధపడుతూ కూర్చున్నాడు. నాలుగైదు రోజులు అతనికి నిద్రాహారాలు లేవు.

చివరకు అతను పురోహితుడి ఇంటికి వెళ్ళి, "అయ్యా, ఒక సందేహం. మా నాన్న వైతరణి దాటాడంటారా?" అన్నాడు.

"ఎప్పుడో దాటి ఉంటాడు," అన్నాడు పురోహితుడు.

"మళ్ళీ ఆయనను వెనక్కు పంపరుగా?" అన్నాడు రైతు.

"ఒకసారి వైతరణి దాటాక ఇక వెనక్కు రావటం ఉండదు," అన్నాడు పురోహితుడు.

"ఐతే నా ఆవును నేను తోలుకుపోతున్నా," అని రైతు అంతపనీ చేశాడు.

—యస్. రాఘవేంద్రరాజు.





# పిల్లనిచ్చిన మామగారు

సీనయ్యా అనే అయనకు శంకరయ్యా అనే కొడుకు ఉండేవాడు. సీనయ్యాకు తన కొడుకు ఎందుకూ కొరగాని వాడని నమ్మకం. అందుచేత అయన ప్రతిదానికీ వాణ్ణి శాసిస్తూ, కోప్పడుతూ వాడికి సొంత అలోచన అనేది సాధ్యం కాకుండా చేశాడు.

తండ్రిడే శాసనంగా పెరిగిన శంకరయ్యా శుద్ధ వెర్రి వెంగళప్పగానే తయారయాడు. పెరుగుతున్న కొద్దీ వాడి బుర్ర పూర్తిగా చెడింది. వాడికి సొంతాన నేర్చుకున్న విద్య ఒకటే తెలుసును. అదేమిటంటే, ఊరి చెరువులో మునిగి, ఊపిరి బిగబట్టి, చాలా సేపు కూర్చోవటం. తండ్రి అదుపు లేకుండా వాడు ఈ విద్య అద్భుతంగా నేర్చుకున్నాడు. తండ్రి ఏ పని చెప్పినప్పటికీ వాడు దాన్ని ఏదోవిధంగా పాడు చేసేవాడు.

కొడుక్కు పెళ్ళి చేస్తే వాడికి తెలివి తేటలు వస్తాయేమోనన్న ఒక్క ఆశ సీనయ్యాను వదలలేదు. సీనయ్యాకు భార్యలేదు గనక, కోడలు వచ్చి తనకు ఇంటి పని చూసుకునే బాధ తప్పిస్తుందన్న ఆశ కూడా ఉన్నది. అయితే, గ్రామంలో ఎరిగిన వాళ్లెవరూ శంకరయ్యాకు పిల్లనివ్వటానికి ఒప్పుకోలేదు.

ఇలా ఉండగా పొరుగూరిలో ఒక సంబంధం ఉన్నట్టు తెలిసింది. సీనయ్యా తన కొడుకును పెళ్లి చూపులకు తీసుకుపోతూ, అక్కడ ఎలా మసులుకోవాలో వివరంగా చెప్పి, "ముందు వెళ్ళుతూనే చెప్పులు తలుపు వెనక విడిచి, నువ్వు కుర్చీ మీద కూర్చో, తెలిసిందా?" అన్నాడు.

శంకరయ్యాకు తండ్రి ఏది చెప్పినా ఉన్న మతి కూడా పోతుంది. అయినా

ఎం. కామేశ్వరరావు

వాడు, తెలిసిందన్నట్టు తల ఆడించి, తండ్రి చెప్పిన మాటలు మళ్ళీ మళ్ళీ అనుకుంటూ, బండిలో ఎక్కి కూర్చున్నాడు. కాని దారిలో ఆ మాటలు తారుమారయాయి.

తీరా ఊరు చేరి, ఇల్లు చేరి, శంకరయ్య తన చెప్పులు తీసి కుర్చీ మీద పెట్టి, తాను పోయి తలుపు వెనకాల కూర్చున్నాడు.

పిల్లతండ్రికి శంకరయ్యను చూడగానే అంతా అర్థమయిపోయింది. ఆయన ఆ తండ్రి కొడుకులకు పిల్లనైనా చూపకుండా, "ఈ వెర్రిబాగుల సంబంధం మా కొద్దు," అని వారిద్దరినీ వచ్చిన దారినే పంపేశాడు.

ఇంటికి వచ్చాక సీనయ్య శంకరయ్య మీద విరుచుకు పడి, "ఇక నీకీ జన్మలో పెళ్ళికాదు. తలమాసిన వాడెవడైనా నీకు పిల్లనిస్తే ఇయ్యాలి!" అని కసురుకున్నాడు.

తనకు పిల్లనిచ్చే తలమాసిన వాణ్ణి వెతకటానికి శంకరయ్య నిశ్చయించాడు. ఆ రాత్రికి రాత్రే వాడు ఇంటి నుంచి బయలుదేరాడు. వాడు మూడు రోజులు ప్రయాణం చేసి నాలుగో రోజు చీకటి పడే వేళకు ఒక కొండ ప్రాంతానికి చేరాడు. అక్కడ ఒక గుహలో నుంచి



విచిత్రమైన ధ్వని వాడికి వినిపించింది. ఆ గుహలో ఒక రాక్షసుడు నిద్ర పోతున్నాడు. వాడు పెడుతున్న గురకే శంకరయ్య విన్నది.

శంకరయ్య లోపలికి వెళ్ళి, రాక్షసుణ్ణి చూసి, వాడి జుట్టు మట్టికొట్టుకుని, మాసినట్టుండటం గమనించాడు. "నాకు పిల్లనిచ్చే తలమాసినవాడు, నేను వస్తున్నానని తెలిసి భయపడి ఇక్కడ దాక్కున్నాడన్నమాట!" అనుకుని శంకరయ్య ఆ రాక్షసుణ్ణి జుట్టు పట్టుకుని ఊపాడు.

రాక్షసుడు పెద్దగా ఆవలిస్తూ లేచి, "ఎవడురా నన్ను లేపింది?" అని కోపంగా గర్జించాడు.

"పిల్లనివ్వకుండా ఎటు పోతావురా, తలమాసిన వెధవా? వెంటనే కట్నంతో సహా నాకు పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యి." అంటూ శంకరయ్య రాక్షసుడి చెవి మెలి పెట్టాడు.

రాక్షసుడికి పట్టరాని కోపం వచ్చింది. వాడు ఆ కోపంలో శంకరయ్యను విరుచుకు తినేవాడే. కాని ఈ లోపుగా, గుహ లోపలి గుహలో ఉన్న రాక్షసుడి పెళ్ళాం, శంకరయ్య అన్న మాటలు విని ఇవతలికి వచ్చింది. ఎందుకంటే, దానికొక కూతురు ఉన్నది. ఆ పిల్లది చాలా స్థూలకాయం. ఎంత ప్రయత్నించినా దానికి యీ నాటివరకూ సంబంధం కుదరలేదు.

అందుచేత రాక్షసి ఇవతలికి వస్తూనే, "ఏం రాక్షసుడివయ్యా నువూ? అల్లుడు వస్తే ఒక మర్యాదా, మంచీ లేదూ!" అంటూ తన మొగుడి మీద విరుచుకు పడింది.

"ఇంతకూ పిల్ల ఏదీ?" అంటూ శంకరయ్య చుట్టూ చూశాడు.

"ఇప్పుడే విహారానికి వెళ్ళింది. ఇంకో ఝాముకుగాని రాదు. అలిసి వచ్చావు, ఒక కునుకుతియ్యి." అన్నది రాక్షసి.

శంకరయ్య రాక్షసి పెట్టిన పళ్ళు తిని, పాలు తాగి, లోపలి గుహలో జంతువుల చర్మాల మీద శయనించాడు.

శంకరయ్య పుష్టి అయినవాడు. వాణ్ణి తినాలని రాక్షసుడికి కోరికగా ఉన్నది.



కాని రాకసి శంకరయ్య పడుకున్న గుహకు అడ్డంగా కూర్చున్నది.

రాకసికూతురు అర్ధరాత్రి వచ్చింది. అది చేసిన అడావుడికి శంకరయ్య మేలు కుని, తల్లీ కూతుళ్ళ సంభాషణ విన్నాడు.

"ఇన్నాళ్ళకు మొగుడు నిన్ను వెతుక్కుంటూ వచ్చాడే," అన్నది తల్లి రాకసి.

"ఎక్కడ? ఎక్కడ?" అంటూ కూతురు రాకసి శంకరయ్య పడుకున్న గుహలోకి తొంగి చూసింది. కళ్ళు కొంచెంగా తెరిచి రాకసి కూతుర్ని చూసి శంకరయ్య అదిరిపడ్డాడు. అది తల్లి దంష్ట్రుల కన్న కూడా వికారంగా ఉన్నది.

శంకరయ్యను చూసి రాకసి కూతురు, "వెన్నపూస లాగున్నాడు!" అన్నది.

"వాణ్ణి విరుచుకు తింటావా ఏం? ఆ పని మాత్రం చెయ్యకు. వీడు తప్పితే నీకు మరొక మొగుడు దొరికే అవకాశమే లేదు," అని తల్లిరాకసి కూతుర్ని హెచ్చరించింది.

"నా మాట సరే. అయ్యా మాటేమిటి? మనిషి దొరికితే తినకుండా వదలడు," అన్నది కూతురు.

"అందుకే నేను బయటికి కూడా పోకుండా కాపలా కాస్తున్నా. నేను కాస్సేపు అలా తిరిగి వస్తా. నువు కాపలా కూర్చో," అని తల్లి రాకసి బయటికి వెళ్ళిపోయింది.

రాకసి కూతురికి శంకరయ్యను చూస్తున్న కొద్దీ తినాలన్న కోరిక పెరగ



సాగింది. గుహలోనే తినేస్తే తల్లి తనను బతకనివ్వదు. అందుకని రాకసి కూతురు శంకరయ్యను నిద్రలేపి, "పెళ్లి ఏర్పాట్లన్నీ అయాయి. పదపోదాం," అన్నది.

అంతా వింటున్న శంకరయ్యకు దాని దొంగ ఎత్తు అర్థమయింది.

"ముందు కట్నం డబ్బు అక్కడ పెడితేనే పెళ్ళి!" అన్నాడు వాడు.

రాకసి కూతురు లోపలికి వెళ్ళి, ఒక తోలు సంచీ నిండా రత్నాలూ, బంగారమూ తెచ్చి, శంకరయ్య చేతికిచ్చి, పదమన్నది. శంకరయ్య సంచీ మూతి కట్టి చంకన పెట్టుకుని, రాకసి కూతురి వెనకనే బయలుదేరాడు.

గుహ దాటి ఇవతలికి రాగానే వాడు రాకసి కూతురితో, "స్నానం చెయ్యకుండా పెళ్ళి ఏమిటి? ముందు స్నానం చెయ్యాలి," అన్నాడు.

రాకసి కూతురు వాణ్ణి ఒక కోనేరు దగ్గిరికి తీసుకు పోయింది. వాడు సంచీతో సహా కోనేరులోకి దూకి, అడుగున కూర్చున్నాడు.

రాకసి కూతురు ఎంతసేపు చూసినా వాడు మళ్ళీ పైకి రాలేదు. దానికేమో నీరు అంటే చచ్చే భయం. వాడు మర్నాడు చచ్చి పైకి తేలుతాడనీ, అప్పుడు తాను వచ్చి వాణ్ణి పీక్కు తినవచ్చుననీ అనుకుని అది తమ గుహకు తిరిగి వెళ్ళింది.

తరవాత శంకరయ్య తల నీటి పైకి పెట్టి, రాకసి కూతురు పోయిందని తెలుసుకుని సంచీతో సహా ఇంటికి తిరిగి వచ్చాడు.

డబ్బుతో తిరిగి వచ్చిన శంకరయ్యకు మంచి సంబంధం దొరికింది. తన అదుపు లేకపోతే తన కొడుకు వెర్రి వెంగళప్ప కాడని సీనయ్య అప్పటికి గ్రహించాడు.

ఆ తరవాత శంకరయ్య తాను యోగ్యుడే నని రుజువు చేసుకోడానికి ఎంతో కాలం పట్టలేదు.





# దొరికిన దొంగలు

ఒక దొంగ ఒక రైతు ఇంటి నుంచి బలిసిన మేకను నేర్పుకా దొంగిలించి తన ఇంటికి తెచ్చాడు.

ఆ మేకను చూసి దొంగ భార్య చాలా సంతోషించి, ''మూడు నాలుగు రోజులకు సంత జరుగుతుంది. అంతదాకా దీని పాలు తాగుదాం,'' అన్నది.

సంత రోజున దొంగ చీకటితోనే లేచి, మేకను తీసుకుని సంతకు బయలుదేరాడు. ఇంకా బాగా తెల్లవారలేదు. దొంగ వెళ్ళేదారిలో చెట్టు కింద ఒక మనిషి నిద్రపోతూ కనిపించాడు. ఆ మనిషి బట్టచెంగున ఏదో కట్టి ఉన్నట్టు దొంగకు కనిపించింది. దొంగ ఉపాయంగా ఆ మూట ఎప్పేసరికి బంగారు ఉంగరం బయట పడింది.

దొంగ మేకను అక్కడే వదిలేసి, ముందు ఆ ఉంగరాన్ని ఎక్కడైనా అమ్మటానికి వేగంగా బయలుదేరాడు. దాన్ని తన ఊళ్ళో నగల వ్యాపారికి అమ్మవచ్చు గాని, ఈ బీదవాడికి బంగారు ఉంగరం ఎక్కడిదన్న ప్రశ్న బయలుదేరుతుంది. అందుచేత దొంగ సమీపంలో ఉన్న గ్రామానికి పరిగెత్తిపోయి, అక్కడి నగల వ్యాపారికి దాన్ని అమ్మజూపాడు.

నగల వ్యాపారి దాన్ని చూడగానే, అది జమీందారుగారికి తాను అమ్మిన ఉంగరమని పోల్చుకున్నాడు. అతను

సి. పద్మనాభశర్మ

జమీందారుకు వెంటనే కబురుపెట్టి, దొంగతో బేరం సాగించాడు. తాను పోగొట్టుకున్న ఉంగరం దొరికిందని విని జమీందారు సంతోషించి, తన మనుషులను నగల వ్యాపారి వద్దకు పంపాడు. వాళ్లు వచ్చి, దొంగ చెప్పేదేమీ వినిపించుకోకుండా, వాణ్ణి చావగొట్టి పంపేశారు.

ఈ లోపుగా చెట్టు కింద నిద్రపోతున్న వాడు లేచి, తన కొంగున కట్టిన ఉంగరం పోయినట్టు తెలుసుకున్నాడు. ఉంగరం దొరికిన సంతోషంలో వాడు ఒళ్లు తెలియకుండా నిద్రపోయాడు. కాని ఆ ఉంగరం కాస్తా పోయేసరికి వాడికి ఏడుపు వచ్చింది.

ఇంతలో సమీపంలో మేక అరుపు వినిపించింది. చుట్టుపక్కల నరసంచారం లేదు. అందుచేత వాడు ఆ మేకను తీసుకుని, తిన్నగా సంతకు బయలుదేరాడు. దాన్ని సంతలో అమ్మితే కొంత గిట్టుబాటు అవుతుందని వాడి ఉద్దేశం. వాడు ఆ మేకను తీసుకుని ఒక రైతు ఇంటి ముందునుంచి పోతూండగా ఆ ఇంటివాడు మేకను చూసి, అది తనదేనని గుర్తించాడు. అదీగాక తన ఇల్లు చేరగానే మేక గట్టిగా అరిచింది.

రైతు నలుగురినీ కేకపెట్టి దొంగను పట్టుకున్నాడు. ఆ మేక ఆ రైతుదేనని వారందరికీ తెలుసు. అందుచేత నలుగురూ కలిసి వాణ్ణి చావతన్ని పంపేశారు.

ఈ విధంగా దొంగలు ఒకరు చేసిన దొంగతనానికి ఒకరు శిక్ష అనుభవించారు.



# రాజరహస్యం

ఒక దేశపు యువరాజు తనకు ఏ సందేహం వచ్చినా మంత్రిని అడుగుతూ ఉండేవాడు. ఒకనాడు అతను మంత్రితో సహ వాహ్యాళి చేస్తూ, "ప్రతి చిన్న విషయాన్నీ మీరూ, మా తండ్రిగారూ అమిత రహస్యంగా మాట్లాడతారెందుకు?" అని అడిగాడు.

"ఆ సంగతి తరవాత చెబుతాను," అన్నాడు మంత్రి.

మర్నాడు వాళ్ళిద్దరూ వాహ్యాళికి వెళ్ళారు. అప్పుడు మంత్రి యువరాజుతో, "ఇవాళ మన సైనికులు మన పొరుగు రాజైన బ్రహ్మదత్తుడి గూఢచారులను ఇద్దరిని పట్టుకున్నారు," అన్నాడు కొంచెం గట్టిగా, తమ వెనక ఉన్న సేవకులకు వినిపించేటట్టుగా.

సేవకులు ఆ రాత్రి తమ తమ ఇళ్ళకుపోయి తమ తమ భార్యలతో, బ్రహ్మదత్తుడి గూఢచారులు పట్టుబడిన సంగతి తలా ఒక విధంగానూ వర్ణించి చెప్పారు. శత్రు గూఢచారులు రాజమందిరంలో పట్టుబడ్డారని ఒకడూ, దాన్ని గురించి రాజూ, మంత్రీ చర్చలు జరిపారని మరొకడూ, బ్రహ్మదత్తుడి సేనలు సరిహద్దు మీద మోహరించి ఉన్నాయని ఒకడూ, యుద్ధం జరగవచ్చునని మరొకడూ, ఇలా చెప్పారు.

మర్నాటికి నగరమంతటా యుద్ధం జరగబోతున్నదనీ, సేనలు యుద్ధానికి బయలుదేరాయనీ పుకార్లు వ్యాపించాయి. నగరం అల్లకల్లోలమయింది. అందరూ వస్తువులు నిలవ చేయసాగారు. వర్తకులు ధరలు పెంచారు. రాజుగారు యుద్ధం లేదని చాటింపు వేస్తేగాని నగరంలో యథాస్థితి రాలేదు.

మంత్రి యువరాజుతో, "చూశావా, నాయనా! ఎంత చిన్న రహస్యానికి ఎంత కల్లోలం అయిందో!" అన్నాడు.

—సత్తిబాబు.





# లాభించిన ఉపదేశం

రామాపురంలో గోపాలాచార్యులు అనే ఆయన తన యింటి అరుగు మీద శిష్యులకు చదువు చెబుతూ ఉండేవాడు. ఆయన ఒక రోజు మాటల సందర్భంలో తన శిష్యులతో, "మనం ఒక చెంబు తీసుకుని నూతి వద్దకు వెళ్ళినా, నది వద్దకు వెళ్ళినా ఆ చెంబుడు నీళ్ళే దొరుకుతాయి. అదే మనకు ప్రాప్తం. మనం బంగారు కొండ వద్దకు వెళ్ళినా, శ్మశానానికి వెళ్ళినా మనకు ఎంత ప్రాప్తం ఉందో అంతే లభిస్తుంది," అని చెబుతున్నాడు.

ఈ మాటలు ఆచార్యులుగారి శిష్యులకు ఎంతవరకు తల కెక్కాయో తెలియదు గాని, ఆ సమయంలో ఆచార్యులు గారి ఇంటి ముందుగా వెళుతున్న శివయ్య మనస్సుకు మాత్రం చాలా బలంగా పట్టాయి.

శివయ్య ఆ వూరి పూజారికొడుకు. పాతికేళ్ళు పై బడినా అతడికి లోకజ్ఞానం గాని, పనులు చేసుకునే నేర్పుగాని అలవడ లేదు. అతడి తండ్రి, "దేవాలయానికి వచ్చి కూర్చోరా, పూజా విధానమైనా తెలుస్తుందేమో!" అని ఎన్నో సార్లు చెప్పి చూశాడు. కాని శివయ్య తండ్రి మాటలేవీ వినిపించుకోలేదు. ఇంట్లో శివయ్యను ఒక మనిషిలాగా చూసే వారు కారు.

ఎక్కడికైనా వెళ్ళి పోదామనుకుంటున్న శివయ్యకు ఆచార్యులుగారి మాటలు దారిచూపి నట్టయింది. బంగారు కొండ ఎక్కడ ఉన్నదో, అసలు ఉన్నదో లేదో తెలియదు, కాని ఊరికి ఉత్తరంగా శ్మశానం ఉన్నది.

ఆ రాత్రి శివయ్య కడుపునిండా తిని శ్మశానికి వెళ్ళాడు. చీకట్లో అక్క

మేడిశెట్టి సత్యవతీదేవి

డక్కడా సమాధులు వికృతంగా కనిపిస్తు న్నాయి. రెండు చోట్ల శవాలు ఇంకా కాలుతూనే ఉన్నాయి. శ్మశానం మధ్య ఒక మంటపం ఉన్నది. తన ప్రాప్తం ఏమిటో తెలుసు కోవటానికి శివయ్య ఆ మంటపంలోకి చేరుకుని, కళ్ళు మూసుకుని, ఏం చెయ్యాలా అన్న ఆలో చనలో పడ్డాడు. అలా ఆలోచిస్తూండ గానే, ఎప్పుడు పట్టిందో అతడికి సుఖంగా నిద్ర పట్టింది.



నిద్రపోతున్న శివయ్యకు, తన బట్టలు పట్టుకుని ఎవరో గట్టిగా లాగుతున్నట్టూ, తనను నేల మీద ఇటూ అటూ పొర్లిస్తు న్నట్టూ తోచింది.

శివయ్య మొద్దునిద్ర పోయేవాడు కావటం చేత అతను కళ్ళు తెరవలేదు. అతను తెల్లవార్లూ అలాగే నిద్రపోయి, ముఖాన ఎండ పడే సరికి లేచాడు. అతను లేచి కూర్చుని, తన ముందు రెండు బంగారు కణికెలు పడి ఉండటం చూశాడు. అవే తన ప్రాప్తం కాబోలు ననుకుని, వాటిని తీసుకుపోయి అతను తన తండ్రికి ఇచ్చాడు. వాటిని చూసి పూజారి దిగ్భ్రమ చెందాడు.

ఆ బంగారం ఖర్చు అయేదాకా శివయ్య ఎప్పటి లాగే తిరిగాడు. ఆ తర వాత అతను మరొకసారి శ్మశానానికి వెళ్ళి, అక్కడ పడుకున్నాడు. ఈ సారి నిద్రలో, తనను ఎవరో ఎక్కడికో ముళ్ళ దారుల కుండానూ, చితిమంటల మధ్య నుంచీ తీసుకు పోతున్నట్టు శివయ్యకు తోచింది. అయినా అతను లక్ష్యపెట్ట లేదు, నిద్ర లేవలేదు. తెల్లవారినాక లేచి చూస్తే, మళ్ళీ అతని ముందు రెండు బంగారు కణికలు కనిపించాయి. అతను సంతోషంగా వాటిని తీసుకుని ఇంటికి వెళ్ళాడు.

ఈ సంగతి ఎలాగో గోపాలాచార్యులు గారి దాకా వెళ్ళింది. శివయ్యకు బంగారం దొరకటానికి కారణం తన మాటలేనని కూడా ఆయనకు తెలిసింది.

తన ఉపదేశాలు విని ఎవరుగాని ఇంత లాభం పొందుతారని ఆయన ఊహించి ఉండలేదు.

ఆయన శివయ్యను పిలిపించి, "అబ్బీ, ఇది నీకు న్యాయమేనా? నా మాటలు ఆధారం చేసుకుని నువు ఒక్కడివే బంగారం తెచ్చుకోపటం ఏమయినా బాగుందా?" అని అడిగాడు.

"బాగా లేదండీ. మీ వాటా మీకు తెచ్చి యిస్తాను ఉండండి," అంటూ శివయ్య లేవబోయాడు.

"అబ్బే, అవసరం లేదు. శ్మశానంలో నువు పడుకునే చోటు ఎక్కడో కాస్త నాకు చూపించు, చాలు!" అన్నాడు గోపాలాచార్యులుగారు.

ఆయనను శ్మశానానికి తీసుకుపోయి, తాను పడుకున్నే చోటు చూపించాడు శివయ్య. ఆ రాత్రే ఆచార్యులు శ్మశానంలో పడుకున్నాడు. నిద్రలో ఆయనకు, తన బట్టలు ఎవరో పట్టుకుని లాగుతున్నట్టు తోచింది. ఆయన చప్పున నిద్రలేచి కూర్చున్నాడు. ఎటునుంచో బూడిద కొట్టుకువచ్చి ఆయన కళ్ళలో పడింది.

ఇక తెల్లవార్లూ గోపాలాచార్యులుకు నిద్ర పట్టలేదు. తెల్లవారినాక చూస్తే బంగారు కణికలు కూడా లేవు.

అయినా ఆయన రెండో రాత్రి మళ్ళీ శ్మశానానికి వెళ్ళి పడుకున్నాడు. ఈ సారి నిద్రలో ఆయనకు, తనను ఎవరో ముళ్లలో నుంచీ, మంటలలో నుంచీ నడిపించుకు పోతున్నట్టు తోచింది. ఆయన భయపడిపోయి కళ్ళు తెరిచి చూశాడు. స్పృహ రాగానే ఆయన తాను చితి మంటల మధ్య నిజంగానే నిలబడి ఉన్నట్టు స్పష్టమయింది. అప్పుడే ఒళ్ళు కాలటం కూడా ఆరంభ మయింది. ఆయన దిక్కు తెలియకుండా కాలి సత్తువ కొద్దీ పరిగెత్తి, ముళ్ళు గీరుకున్న గాయాల నుంచి రక్తం ఓడుతూ కొంపకు చేరుకున్నాడు. ఆయనకు అంతే ప్రాప్తం అయి ఉండాలి!






యుద్ధం అయిపోయిన తరవాత పాండవులు గంగా తీరాన చచ్చిపోయిన బంధువులకు తిలోదకాలూ, దశదానాలూ మొదలయినవి చేసి, ఒక నెల రోజులు మైలపట్టి, ధృతరాష్ట్రుడితోనూ, విదురుడితోనూ, స్త్రీజనంతోనూ నగరం వెలపల ఒక పర్ణశాలలో నివసించారు.

తరవాత ధర్మరాజును చూడటానికి వ్యాసుడు మొదలైన మునులూ, వారి శిష్యులూ, బ్రాహ్మణులూ, గృహస్థులూ వచ్చారు.

ధర్మరాజు వారితో, "కృష్ణుడూ, భీమార్జునులూ నాకు విజయం కలిగించారు. కాని నాకు ఇది విజయంగా తోచటం లేదు. జ్ఞాతులను చంపుకున్నాను. అభిమన్యుణ్ణీ, ద్రౌపది కొడుకులనూ పోగొట్టుకున్నాను. నాకు ఈ రాజ్యభోగం ఏమి రుచిస్తుంది? ఇది ఇలా ఉండగా, మహాదాతా, మహావీరుడూ అయిన కర్ణుడు మాకు అన్న అని మా తల్లి తిలోదకాలప్పుడు బయటపెట్టింది. అలాటి మహారథుడు ఎందుకు చచ్చాడో తెలియరాదు," అన్నాడు.

అది విని నారదుడు కర్ణుడికి గల శాపాలను గురించి ధర్మరాజుకు తెలిపాడు.

కర్ణుడు ద్రోణుడి దగ్గిర విద్య నేర్చుకునేటప్పుడు అర్జునుడి విలువిద్యను చూసి అసూయపడేవాడు. అలాగే అతనికి ధర్మరాజు తెలివితేటలూ, భీముడి బాహు బలమూ, నకుల సహదేవుల

60. చార్వాకవధ



సౌజన్యమూ, కృష్ణార్జునుల మధ్య స్నేహమూ చూసి అసూయగా ఉండేది. ఆ కారణం చేతనే అతను దుర్యోధనుడి స్నేహం సంపాదించాడు.

ద్రోణుడికి శిష్యుడుగా ఉంటూ కర్ణుడు ఒకనాడు రహస్యంగా ద్రోణుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా, మీకు శిష్యుల పట్ల పక్షపాత బుద్ధి లేదుగదా, యుద్ధంలో ఎలాగైనా అర్జునుణ్ణి జయించాలని నాకు తీవ్రమైన కోరిక ఉన్నది. నాకు బ్రహ్మాస్త్రం ప్రయోగ ఉపసంహారాలతో ఉపదేశించండి," అని కోరాడు.

ద్రోణుడు అర్జున పక్షపాతి. అందు చేత కర్ణుడితో, "నువు సూతుడి కొడుకువు. బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ తప్ప బ్రహ్మాస్త్రం ఇవ్వరాదు," అన్నాడు.

ఈ మాట విని కర్ణుడు, మహేంద్రగిరి సమీపంలో తపస్సు చేసుకుంటున్న పరశురాముడి వద్దకు వెళ్ళి, సాష్టాంగ వందనం చేసి, "మహాత్మా, నేను భృగువంశానికి చెందిన బ్రాహ్మణ్ణి. నన్ను నీ శిష్యుడు'గా స్వీకరించు," అన్నాడు. పరశురాముడు అందుకు సమ్మతించాడు. పరశురాముడు అతనికి అనేక శస్త్రాలూ, అస్త్రాలూ ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో తెలిపాడు.

ఇలా ఉండగా ఒకనాడు కర్ణుడు తన ధనుర్బాణాలతో తన గురువు ఆశ్రమానికి సమీపంగా సముద్ర తీరాన తిరుగుతూ ఒక ఆవును చూసి, దాన్ని బాణంతో కొట్టి చంపాడు. అది ఒక బ్రాహ్మణుడి హోమధేనువని అతనికి తెలిసింది. వెంటనే కర్ణుడు ఆ బ్రాహ్మణుడికి క్షమాపణ చెప్పుకున్నాడు. కాని ఆ బ్రాహ్మణుడు శాంతించక, "యుద్ధంలో నీ రథచక్రం భూమిలో కుంగి, శత్రువు చేత దెబ్బతిని, నా ఆవు చచ్చినట్టు చావు," అని శాపం పెట్టాడు.

కర్ణుడు పరశురాముణ్ణి తన నిరంతర సేవలతోనూ, విద్యా కౌశలంతోనూ మెప్పించి, ఆయన వద్ద ధనుర్వేద మంతా



నేర్చుకుని, బ్రహ్మాస్త్రం ఉపదేశం పొందాడు. కాని ఒకనాడు ఒక వింత జరిగింది. పరశురాముడు కర్ణుడి తొడ మీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు. ఇంతలో ఏదో కీటకం కర్ణుడి తొడను తొలచసాగింది. కర్ణుడు బలవంతాన బాధ సహించుకుని, గురువుకు నిద్రా భంగం కలగకుండా ఉండగలందులకు నిశ్చలంగా కూర్చున్నాడు. అతని రక్తం కాలువలు కట్టింది.

తరవాత పరశురాముడు లేచి, రక్తం చూసి, కర్ణుడి తొడను కొరుకుతున్న పురుగును కళ్ళారా చూసిన మీదట, "ఓరీ, బ్రాహ్మణుడికి ఇంత సహనం ఉండదు. నువు నిజంగా ఎవరు?" అని అడిగాడు.

నిజం చెప్పకపోతే పరశురాముడు శపిస్తాడని భయపడి కర్ణుడు తాను సూత కులం వాణ్ణని చెప్పాడు. బ్రహ్మాస్త్రం కర్ణుడికి యుద్ధంలో స్ఫురించకుండా పరశురాముడు శాపం పెట్టాడు.

ఇన్ని శాపాలకు గురి అయి కూడా కర్ణుడు గొప్ప యోధుడనిపించుకున్నాడు. కళింగదేశంలోని రాజపురానికి రాజైన చిత్రాంగదుడి కుమార్తెకు స్వయంవరం జరిగినప్పుడు దుర్యోధనుడు ఆమెను బలాత్కారంగా ఎత్తుకుపోతూంటే మిగిలిన రాజులు అతనిపై యుద్ధానికి వచ్చారు. అప్పుడు కర్ణుడు అతనికి విజయం చేకూర్చిపెట్టాడు.

మరొకసారి కర్ణుడు ఎవరికీ జయించరాని జరాసంధుణ్ణే జయించి, అతని నుంచి మాలిని అనే గొప్ప నగరాన్ని కానుకగా పుచ్చుకున్నాడు. అతని పరాక్రమం చూసి ఇంద్రుడు అర్జునుడి క్షేమం కోసం అతని కవచకుండలాలు పట్టుకుపోయాడు. కర్ణుడు యుద్ధంలో చావటానికి ఇవన్నీ తోడ్పడ్డాయి.

నారదుడి నుంచి కర్ణుడి విషయాలు ఈ విధంగా తెలుసుకుని, యుద్ధంలో చచ్చిన వారినందరినీ తలుచుకుని ధర్మ

రాజు, "పిల్లల కోసం తల్లిదండ్రులు పడరాని పాట్లు పడతారు. వాళ్ళు భోగాలు అనుభవించటం కోసమే గదా తల్లులు తొమ్మిది నెలలు మోసి, ప్రసవవేదన అనుభవిస్తారు! భోగాలు అనుభవించకుండా ఎంతమంది యువకులు ఈ యుద్ధంలో దుర్మరణం పొందారు! ఛీ, క్షత్రియ ధర్మం! రాజ్యం కోసం ఎంత పాపానికి ఒడిగట్టాను! నాకీ రాజ్యం అక్కర్లేదు. అర్జునా, దీన్ని నువే ఏలుకో. నేను తీర్థయాత్రలు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలో అర్జునుడికి ఏదో అవమానం తోచి, కొంచెం కోపం కూడా వచ్చింది. అతను ధర్మరాజుతో, "అన్నా, మనం మన రాజ్యం తిరిగి సంపాదించుకునేటందుకు క్షత్రియధర్మాన్ని అవలంబించాం. తీరా రాజ్యం వచ్చాక బిచ్చం ఎత్తుకుంటాననటం అసందర్భంగా ఉన్నది. బిచ్చమే ఎత్తుకోదలిస్తే ఇంతమందినీ ఎందుకు చావనిచ్చినట్టు? ఇప్పుడు నువు బిచ్చమెత్తుతానంటే అందరూ నిన్ను చూసి నవ్వరా? దారిద్ర్యం కోరదగినది కాదని నహుషుడు చెప్పాడు. అన్ని ధర్మాలకూ మూలం ధనమే కదా! అందుచేత రాజ్యం స్వీకరించు. అశ్వమేధ యాగం చేసి, అన్ని పాపాలూ పోగొట్టుకో," అని చెప్పాడు.



భీముడు అర్జునుడికి తోడై, "రాజధర్మాన్ని తిట్టటంలో అర్థమేమిటి? శత్రువులను చంపటంలో దయ ఏమిటి? హింస ఏమిటి? పని పెట్టుకుని దుర్యోధనుడు మొదలైన వాళ్ళను చంపినది బిచ్చం ఎత్తుకోవటానికా? ఈ సంగతి ముందే తెలిస్తే మేం ఆయుధాలు పట్టుతామా? ఇంతమందిని చంపుతామా? శక్తి కొద్దీ మేమూ బిచ్చమే ఎత్తుకునే వాళ్ళం. నుయ్యి తవ్వి నీరు ఉపయోగించనినే వాడిలాగా మాట్లాడుతున్నావు. నిన్ను అనవలసిన పనిలేదు. నీ మాటకు కట్టుబడి బలవంతులమై కూడా అసమర్థులలాగా తిరగటం మాదే తప్పు.



ఈ మాటలు కట్టిపెట్టి రాజ్యం ఏలుకో,'' అన్నాడు. నకుల సహదేవులు కూడాధర్మరాజును ఈ విధంగానే హెచ్చరించారు.

తరవాత ద్రౌపది ఇలా చెప్పింది:

''నీ తమ్ములు చెప్పినట్టు చెయ్యి. వాళ్ళు అరణ్యవాసంలో పడరాని కష్టాలు పడుతున్నప్పుడు, ఈ కష్టాలు ఎల్లకాలం ఉండవనీ, త్వరలోనే దుర్యోధనుణ్ణి జయించి రాజ్యం సంపాదించుకొంటామనీ నువు వారిని ఓదార్చిన మాట గుర్తు తెచ్చుకో. అప్పుడు అలా అని ఇప్పుడు ఈ మాటలంటే వీరికి నిరుత్సాహం కలుగుతున్నది. పూర్వం నువు అనేక రాజ్యాలు జయించినది యుద్ధం చేసి కాదా? రాజ్యం సంపాదించటానికి మరో మార్గం ఏదైనా ఉన్నదా? ఇలాగే మాట్లాడితే, 'ధర్మరాజుకు మతిపోయింది,' అంటారు. అంబరీషుడూ, మాంధాతా లాటి మహామహులు రాజ్యాలు ఏలారు.''

ఇంకా అనేకమంది ఋషులు ధర్మరాజుకు హితోపదేశం చేశారు. వ్యాసుడు ధర్మరాజుతో, ''తనను చంపవచ్చిన వాడు వేద వేదాంగపారగుడైనా చంపవచ్చును. అందువల్ల బ్రహ్మహత్యా దోషం కలగదు,'' అని చెప్పాడు.

తన తమ్ములేగాక, దేవస్థానుడూ, వ్యాసుడూ, కృష్ణుడూ కూడా చెప్పిన మీదట ధర్మరాజు తన విచారానికీ, అనుమానాలకూ స్వస్తి చెప్పి, రాజ్యం ఏల నిశ్చయించాడు.

ధర్మరాజు కోసం రథం సిద్ధమయింది. దానికి పదహారు తెల్లని ఎద్దులు కట్టి, తెల్లని స్తంభాలు అమర్చారు. పగ్గాలు పట్టుకుని భీముడు సారథి స్థానంలో కూర్చున్నాడు. అర్జునుడు ధర్మరాజుకు తెల్లని గొడుగు పట్టాడు. నకుల సహదేవులు ఆయనకు వింజామరలు పట్టారు. ధర్మరాజు ఎక్కిన రథం వెనకగా యుయుత్సుడి రథం కదిలింది. దాని వెనక కృష్ణ సాత్యకులు రెండు గుర్రాలు లాగే రథంలో వెళ్ళారు. ఈ ఊరేగింపుకు

ముందుగా ఒక పల్లకిలో గాంధారీ, ధృత రాష్ట్రులూ, కౌరవ స్త్రీలూ, కుంతీ, ద్రౌపదీ వేరు వేరు వాహనాలలో విదురుడి వెంట బయలుదేరారు. వెనకగా చతురంగ బలాల సేన వచ్చింది. వందిమాగధులు స్తోత్రపాఠాలు చదువుతూండగా ధర్మ రాజు హస్తినాపురానికి చేరుకున్నాడు. నగరం అంతా చక్కగా అలంకరించి ఉన్నది. అంతటా తెల్లని పూల తోర ణాలూ, తెల్లని జెండాలూ ఉన్నాయి.

వైభవంగా ధర్మరాజు పుర ప్రవేశం చేసేటప్పుడు వేలకొద్దీ పౌరులూ, పౌర కాంతలూ చూడటానికి వచ్చి వీధుల నిండా నిలబడి, హర్షం వెలిబుచ్చారు. మంత్రులూ, తదితర ప్రముఖులూ వచ్చి, "రాజేంద్రా, మా భాగ్యం చేత నువు శత్రువులను జయించి, ధర్మంగా తిరిగి రాజ్యం పొందావు," అన్నారు. బ్రాహ్మ ణులు ధర్మరాజును ఆశీర్వదించారు.

ధర్మరాజు రాజమందిరం ప్రవేశించి, ధౌమ్యుడికీ, ధృతరాష్ట్రుడికీ నమస్క రించి, దేవతారాధన చేశాడు. ఇంతలో పెద్ద కలకలం పుట్టింది. దుర్యోధనుడికి మిత్రుడైన చార్వాకుడు అనే వాడు ధర్మరాజును సమీపించి, "జ్ఞాతులను చంపి నువు ఏమి అనుభవిస్తావు? నువు ఇలా బతకక పోతేనేం?" అన్నాడు.



ఈ మాట విని ధర్మరాజు సిగ్గు పడుతూ, బ్రాహ్మల కేసి తిరిగి, "నన్ను అనుగ్రహించండి. అసలే విచారంలో ఉన్న నన్ను నిందించ వద్దు," అన్నాడు.

దానికి బ్రాహ్మణులు, "రాజా, ఈ చార్వాకుడి అభిప్రాయం మా అభి ప్రాయం కాదు. వీడు దుర్యోధనుడి స్నేహితుడు. అందుకని ఇలా అంటు న్నాడు. నీకూ, నీ తమ్ములకూ అశుభం గలగబోదు," అని, అందరూ కలిసి ఆ చార్వాకుణ్ణి చంపేశారు. ధర్మరాజుకు మనశ్శాంతి కలగటానికి కృష్ణుడు, చార్వాకుడు కృతయుగంలో ఒక రాక్షసు డనీ, వాడు బదరీవనంలో తపస్సు చేసి

బ్రహ్మను ప్రత్యక్షం చేసుకుని, బ్రాహ్మల నుంచి తప్ప ఇతరుల వల్ల చావు లేకుండా వరంకోరాడనీ యుక్తిగా ఒక కథ చెప్పాడు.

తరవాత ధర్మరాజు యథావిధిగా రాజ్యాభిషిక్తుడయాడు. ధౌమ్యుడు ఒక వేదిక నిర్మింపజేసి, దాని పైన పులి చర్మం పరిపించి, దాని పైన ధర్మ రాజునూ, ద్రౌపదినీ కూర్చోబెట్టాడు. ధౌమ్యుడు అగ్ని చేసి, ధర్మరాజు చేత అందులో హోమం చేయించాడు. తర వాత కృష్ణుడు ఒక శంఖంతో ధర్మ రాజును అభిషేకించి, భూమి కంతటికీ రాజువు కమ్మన్నాడు. ఇందుకు ధృత రాష్ట్రుడూ, ప్రజలూ ఆమోదించారు. మంగళ ధ్వనులు మోగాయి. ధర్మరాజు బ్రాహ్మణ సత్కారం చేశాడు.

ఆయన ప్రజలతో, "మహాజనులారా. మహారాజు ధృతరాష్ట్రుడే మాకు దైవం. మాపై అభిమానం గల వారందరూ ఆయన శాసనాన్నే శిరసావహించాలి. మేము జీవించి ఉన్నది ఆయనకు సేవ చెయ్యటానికే. నాకూ, మీకూ కూడా ఆయనే ప్రభువు!" అన్నాడు.

తరవాత ధర్మరాజు భీముణ్ణి యువ రాజుగా ప్రకటించి, విదురుణ్ణి మంత్రిగా నియమించాడు. సంజయుడు కోశాధి కారీ, సలహాదారూ అయాడు. నకులుడు భృత్యుల వేతనాలు నిర్ణయించటానికీ, అర్జునుడు రాజ్యక్షేమం చూడటానికీ, ధౌమ్యుడు దేవబ్రాహ్మణ కార్యాలకూ నియుక్తులైనారు. సహదేవుడి పని అన్ని వేళలా ధర్మరాజు వెంట ఉండటం.

తరవాత, యుద్ధంలో చచ్చిన వారంద రికీ శ్రాద్ధాలు పెట్టారు, భూదానాలిచ్చారు. ధృతరాష్ట్రుడు తన కొడుకులకూ, ధర్మ రాజు ద్రోణుడికీ, కర్ణుడికీ, ధృష్టద్యుమ్ను డికీ, ఘటోత్కచుడికీ, అభిమన్యుడికీ, విడి విడిగా శ్రాద్ధాలు పెట్టారు. చచ్చిపోయిన వారి జ్ఞాపకార్థం ధర్మ సత్రాలూ, చలిపందిర్లూ, చెరువులూ నిర్మించారు. తరవాత ప్రజల క్షేమం పాటిస్తూ ధర్మరాజు రాజ్యం చేయసాగాడు.






## 9

దమనకం కరటకానికి పామును చంపిన కాకుల కథ చెప్పి, ''తెలివిని మించిన శక్తిలేదు. బుద్ధిబలం కలిగిన కుందేలు సింహం దురహంకారాన్ని రెచ్చగొట్టి, దానికి చావు తెప్పించింది కాదా?'' అన్నది.

''అది ఎలా జరిగింది?'' అని కరటకం అడిగింది. దమనకం ఈ కథ చెప్పింది:

### నీడ తెచ్చిన చావు

**ఒ**కప్పుడు అరణ్యంలో భాసురకం అనే సింహం, సాటిలేని బలం గలది ఉండేది. అది బలదర్పం కొద్దీ నిత్యమూ అనేక లేళ్ళనూ, కుందేళ్ళనూ, ఇతర మృగాలనూ, అకారణంగా చంపుతూ ఉండేది.

ఒకనాడు అడవిలో ఉండే లేళ్ళూ, మేకలూ, ఎనుములూ, కుందేళ్ళూ, ఇతర మృగాలూ ఏకమై సింహం వద్దకు వెళ్ళి, ''మహారాజా, తాము తమ కంట బడిన ప్రతి ప్రాణినీ చంపటం ఇక మీద మానాలి. తమ కడుపు నిండటానికి రోజుకు ఒక జంతువు చాలును. అలాటప్పుడు ఇన్ని ప్రాణాలు తీయనేల? మాతో ఒక ఒప్పందానికి రండి. ఈ రోజు నుంచీ మాలో మేము వంతులు వేసుకుని, ఒక జంతువును తామున్న చోటికే పంపుతాము. తమరు కదిలిరావలిసిన పని కూడా ఉండదు. తమరు ఈ ఒప్పందానికి ఒడబడినట్టయితే తమకు కావలిసిన ఆహారం శ్రమలేకుండా లభిస్తుంది. రాజు ప్రజల సంపదను ఆవులను పాలు పిండినట్టుగా పిండి, కొంత లేగలకు వదిలి, మంద వృద్ధి అయేటట్టు చూడాలి. అప్పుడే అతను ధర్మపాలన చెయ్య

అట్ట చివరి బొమ్మ



గలడు. ఆవులమ పాలు పితకటం మాత్రమే కాదు, వాటికి మేత కూడా వేయాలి. చెట్టుకు ఎరువు వేసి, నీరు పోస్తే గాని ఫలాల నివ్వదు. ఆఖరుకు అతి చిన్న విత్తు కూడా, సరిఅయిన పోషణ జరిగితే, మహావృక్షంగా తయారై, ఎంతో లాభం కలిగిస్తుంది. ప్రజలైనా అంతే," అన్నాయి.

"మీ రన్నది నిజం. మీ ఏర్పాటుకు సమ్మతించాను. కాని ఏ ఒక రోజున అయినా నా వద్దకు మృగం రాక పోయిందో, నేను మీ అందరి ప్రాణాలూ తీస్తాను," అన్నది సింహం. మృగాలు అందుకు సమ్మతించి వెళ్ళిపోయాయి.

ఆ రోజు మొదలు మృగాలన్నీ అరణ్యంలో స్వేచ్ఛగా తిరగ నారంభించాయి. అవి వంతులు వేసుకుని, సింహం వద్దకు రోజు కొక జాతి జంతువును మిట్టమధ్యాన్నం వేళకు పంపుతూ వచ్చాయి. ఇలా ఉండగా ఒకనాడు కుందేలుకు వంతు వచ్చింది. సింహానికి ఆహారం కావాలంటే కుందేలుకు చాలా విచారం కలిగింది. అది అడుగులో అడుగు వేసుకుని అతినింపాదిగా నడుస్తూ, ఈ సింహాన్ని చంపెయ్యటానికి ఉపాయం లేదా అని ఆలోచించసాగింది.

సింహం భోజనం చేసే వేళ దాటి పోయింది. కాని కుందేలు ఇంకా ఆలోచిస్తూనే ఉన్నది. అది ఇలా అనుకున్నది:

"ఈ క్రూరసింహాన్ని ఎలాగైనా చంపాలి. తెలివిగల వాడు సాధించలేనిదీ, దృఢ తీర్మానం గల వాడు జయించలేనిదీ, మధురవాక్కు గల వాడికి సిద్ధించనిదీ ఏదీ ఉండదంటారు."

ఇలా అనుకుంటూ అది ఒక బావి వద్దకు వచ్చింది. ఆ బావిలోకి తొంగి చూసే సరికి, దాని అడుగున ఉన్న నీటిలో దాని ప్రతిబింబం కనబడింది. అది ఒక్క క్షణం ఆలోచించి, "దిక్కుమాలిన సింహాన్ని చంపటానికి అద్భుతమైన ఉపాయం తట్టింది. దానికి

వల్లమాలిన రోషం తెప్పించి, ఈ బావిలో పడి చచ్చేటట్టు చేస్తాను,'' అనుకున్నది.

ఇలా అనుకుని కుందేలు చాలా ఆలస్యంగా సింహం వద్దకు వెళ్ళింది. సకాలంలో తిండి అందక, ఆకలితో అలమటిస్తూ, సింహం అమితమైన కోపంతో ఉన్నది. అది పెదవులు నాక్కుంటూ, ''రేపు జంతువుల నన్నిటినీ చంపేస్తాను,'' అనుకుంటున్నది.

ఇంతలో కుందేలు వచ్చి, సింహానికి ఎదురుగా నిలబడింది.

అసలే పిడికెడు జంతువు, అందులోనూ ఆలస్యంగా వచ్చింది. సింహం దాన్ని చూసి కోపోద్రేకంతో, ''ఒక్క పంటికిందికి రావు, ఆలస్యంగా కూడా వస్తావా? ఇప్పుడు నిన్ను చంపితిని, రేపు మిగిలిన మృగాలన్నిటినీ చంపేస్తాను,'' అన్నది.

కుందేలు సింహం ముందు సాష్టాంగ పడి, ''మహారాజా, నా వల్లగాని, ఇతర మృగాల వల్లగాని ఏ దోషమూ లేదు. నేను ఆలస్యంగా రావటానికీ, మీకు చిన్న భోజనం ఉండటానికీ అసలు కారణం చెబుతాను, వినండి. ఇవాళ తమకు ఆహారం అయేవంతు మా కుందేళ్ళకు వచ్చింది. ఒక్క కుందేలుతో తమకు కడుపు నిండదని, నాతో కలిపి



అయిదు కుందేళ్ళను తమ వద్దకు పంపారు. మేము అయిదుగురమూ తమ వద్దకు వస్తూండగా, నేలలో ఉన్న ఒక గుంటలో నుంచి ఒక పెద్ద సింహం పైకి వచ్చి, 'మీరంతా ఎక్కడికి పోతున్నారు? మీకు ఆయువు తీరిపోయింది గనక ఇష్టదేవతా ప్రార్థన చేసుకోండి,' అన్నది. 'మేము ఒప్పందం ప్రకారం మధ్యాహ్నాని కల్లా భాసురక మనే మహా సింహానికి ఆహారం కావాలి!' అని చెప్పాం. 'అర్థంలేని మాట! ఈ అరణ్యం నాది. మీరు ఒప్పందాలు నాతో చేసుకోవాలి, ఎవరో భాసురకో మనే దొంగతో కాదు. ఆ భాసురకాన్ని ఇలా పిలుచుకు

రండి. ఎవరు ఏమిటో మేము తేల్చుకుంటాం. మాలో ఎవరు గెలిస్తే వాళ్ళే మృగాలన్నిటికీ అధిపతి,' అన్నది. ఆ ప్రకారమే నేను తమ వద్దకు వచ్చి, సంగతి విన్నవించాను. నా ఆలస్యానికి ఇదే కారణం. నేను తిరిగి రాకపోతానేమో నని, ఆ సింహం మిగిలిన కుందేళ్ళను ఉంచేసుకున్నది. అందుకే నేను తమకు అల్పాహారంగా కనిపిస్తున్నాను,'' అన్నది.

ఈ మాటలు విని సింహం, "మిత్రుడా, అలా అయితే నాకు ఆ ప్రత్యర్థి సింహాన్ని చూపించు. నాకు జంతువుల మీద వచ్చిన కోపాన్నంతా దానిపై వెళ్ళగక్కి, మనశ్శాంతి పొందుతాను. శత్రువును శీఘ్రంగా నిర్మూలించకపోతే వాడు బలపడి మననే చంపుతాడు,'' అన్నది.

దానికి కుందేలు, "మహారాజా, అతని బలం తెలుసుకోకుండా తమరు అతనితో యుద్ధానికి పోవటం మంచిది కాదు,'' అన్నది.

''ఎందుకీ వ్యర్థప్రలాపాలు? నాకు ఆ సింహాన్ని చూపించు. వాణ్ణి చంపేస్తాను,'' అన్నది సింహం చిరాకుగా.

కుందేలు సింహాన్ని బావి వద్దకు తీసుకుపోయి, ''ఇదే ఆ సింహం ఉండే కోట,'' అన్నది. అది బావిలోకి తొంగి చూసి, ''తమరు వస్తున్నారని తెలిసి ఆ సింహం అప్పుడే బెదిరిపోయి నట్టున్నది. ఇలా రండి,'' అన్నది.

మతిమాలిన సింహం బావిలోకి తొంగి చూసి, తన ప్రతిబింబాన్ని మరొక సింహం అనుకుని, ఆగ్రహావేశంతో గర్జించింది. ఆ గర్జన బావిలో రెట్టింపు ధ్వనితో ప్రతిధ్వనించింది. ఆ సింహం తనను సవాలు చేస్తున్నదనుకుని, బుద్ధిలేని భానురకం, ఒళ్ళు తెలియని ఆవేశంతో ఆ లోతైన బావిలోకి దూకేసింది.

కుందేలుకు పరమానంద మయింది. పాపిష్ఠి సింహం పీడ వదిలించి నందుకు మిగిలిన జంతువులన్నీ కుందేలును మెచ్చుకుని, సుఖంగా జీవించాయి.



# 147. న్యూక్లియర్ సబ్మరీన్ "స్కేట్"

ఈనాడు అణుశక్తితో నడిచే సబ్మరీనులు (జలాంతర్గాములు) చాలా దేశాలకు ఉన్నాయి. "స్కేట్" అనే సబ్మరీను అణుశక్తితో నడిచేది. ఇది అమెరికాలో నిర్మాణమయింది. అణుశక్తితో నడిచే సబ్మరీనులు నీటి అడుగున చాలా కాలం, ఎంతో దూర ప్రాంతాలకు ప్రయాణించగలవు. వాటికి ఇంధనం సమస్య చాలా కాలానికి గాని కలగదు.

"స్కేట్" చేసిన ఘనకార్యం ఏమంటే, అది ఉత్తర ధ్రువప్రాంతపు మంచు కిందుగా ప్రయాణించి, 1959 మార్చి 17 న ధ్రువం వద్ద మంచు కింది నుంచి పైకి లేచింది. ఆ ప్రదేశంలో మంచు ఎంత మందాన ఉన్నదనేది రహస్యంగా ఉంచబడింది.

ఉత్తర ధ్రువాన్ని చేరటానికి "స్కేట్" 4 వేల చిల్లర మైళ్ళు ప్రయాణించింది. ఈ ప్రయాణంలో 106 మంది పాల్గొన్నారు.



Photo by Brahm Dev



బహుమతి
పొందిన వ్యాఖ్య

పుత్రద్వయం

పంపినవారు :
షేక్. హుస్సేన్‌సాహెబ్

Photo by M. Natarajan



పోలీసు లైన్,
మాచర్ల.

మిత్రద్వయం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు మార్చి నెల 20 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మే నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
మైసూరు నర్తకి

మూడవ అట్ట:
భాంగ్రా నృత్యం

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

Photo by : SURAJ N. SHARMA



BHANGRA DANCE

63

